శ్రీమదాంధ్ర

# మహాభారతము

సాహిత్య విద్యాప్రవీణ
తూములూరి
శివరామ కృష్ణ
శాస్త్రిగారి
లఘువివరణ
పీఠికా సహితము

—

## అనుశాసనిక పర్వము

(భాగము 1.)



ప్రకాశకులు
ఆంధ్ర గ్రంథమండలి
(లిమిటెడ్)

కోటంరాజు
వేంకట దుర్గావరప్రసాదరావు, బి. ఎ.,
మేనేజింగు డైరెక్టరు.

# శ్రీమదాంధ్ర
# మహాభారతము

## ఆనుశాసనిక పర్వము
(భాగము 1.)

సాహిత్య విద్యాప్రవీణ
తూములూరి
శివరామకృష్ణ
శాస్త్రిగారి
లఘువివరణ
టీకాసహితము.

---

ప్రకాశకులు
ఆంధ్రగ్రంథమండలి
(లిమిటెడ్)

కోటంరాజు
వేంకట దుర్గావరప్రసాదరావు, బి. ఎ.,
మేనేజింగు డైరెక్టరు.

(ఆంధ్ర గ్రంథమండలి లిమిటెడ్)

మారీసుపేట - తెనాలి.



శ్రీ విఘ్నేశ్వరాయనమః

# పాలకవర్గము.

౧

మ॥రా। రా॥శ్రీ॥ అమ్మనబ్రోలు ప్రసాదరావుగారు,
లాండులార్డు - బెజవాడ.

,, పసుమర్తి రామకృష్ణయ్యగారు,
లాండులార్డు - మచిలీ బందరు.

,, అబ్బరాజు పూర్ణచంద్రరావుగారు,
లాండులార్డు - పాంచాలవరము.

,, రావిపూడి బంగారురావుగారు,
లాండులార్డు - బాపట్ల.

,, చతుర్వేదుల పార్థసారథి వెంకటప్పయ్యగారు,
ప్రొప్రైటరు భారత గ్రంథమాల - గుంటూరు.

,, ఎ. వి. కృష్ణశాస్త్రిగారు,
భారత గ్రంథమాల - గుంటూరు.

,, కె. వి. డి. వి. ప్రసాదరావుగారు, B. A.,
ప్రొప్రైటరు శ్రీ దుర్గా అండ్ కో.

వీరు డైరెక్టరు ఆఫ్ ఆంధ్రగ్రంథమండలి (లిమిటెడ్)

శ్రీ శ్రీ శ్రీ

# విషయసూచిక.

# ఆనుశాసనికపర్వము.

## పీఠిక.

---

ఆనుశాసనికము భారతమున పదుమూడవ పర్వము. శాంతచిత్తుఁడగు శిష్యునకు సన్మార్గ ముపదేశించుట అనుశాసన పదమున కర్థము. అస్వస్థచిత్తున కనుశాసనము మనసు పట్టదు. గతపర్వమున ధర్మజునిచిత్తము శాంతిపొందినది. ఈపర్వమున ననుశాసింపబడినాఁడు. కనుక నే దీని కీపేరువచ్చినది.

ధర్మస్వరూపములు తదాచరణజన్యఫలవిశేషములు తత్పరిత్యాగోత్థిత ప్రత్యవాయములు నీపర్వమందు సుహృత్సమ్మితముగను నేతిహాసముగను వర్ణింపబడినవి. కర్మలు చిత్తశుద్ధికి సాధనములే కాని శుద్ధచిత్తుఁడు కర్మల నాచరించుట పండువెన్నెల పరిమళించుటవంటిది. కనుక నే శాంతిపర్వము పిదప ఆనుశాసనిక పర్వము ప్రారంభింపబడినది. ఆనుశాసనిక శాంతిపర్వములు పూర్వోత్తర మీమాంసలవంటివి.

రసపిపాసవులకు ఇతిహాస జిజ్ఞాసువులకు నీపర్వద్వయము కౌతుకభంజకముగ భాసించును. భారతమను రసార్ణవమున బడబానలమువలె నీపర్వద్వయమేల? దీనిని పరిత్యజించిన గ్రంథమునకుఁగాని తత్పాత్రములకుఁగాని కలుగు లోప

మేమి? శాంతిపర్వమునకు నీపర్వమునకుఁ గల భేదమేమి? ఈ ధర్మోపన్యాసమున నేమైన క్రమమున్నదా? ఈధర్మము లేక రుఁవు పెట్టుటవలన కలుగు నాధిక్యమేమియను శంకలు . కలుగును. కాని ఈధర్మము లుపదేశింపబడిన ధర్మజునిస్థితి విమర్శించిన పలువిధముల నీపర్వద్వయ మీగ్రంథమున కుపష్టంభకమని చదువరులకు గోచరింపకపోదు.

ధర్మజుని కోపము దుర్యోధనుని లోభము భారత యుద్ధమునకు హేతువులు. క్రోధలోభములు పిశాచములవంటివి. అవి ఆవేశించిన మనుజునకొనర్పరాని కార్యముండదు. ఉచ్చరింపరాని పలుకుండదు. తిరస్కరింపరాని పెద్దలుండరు. కోపావిష్టుడౌటచేఁగదా౦ కర్ణుని చంపలేదని తమ్ముడగు నర్జును ధర్మజుఁడ నొవ్వబలికినది. అర్జునుని కోపమేకదా అన్నను తిరస్కరించి చంపనుద్యమించినది. అట్టియెడ శ్రీకృష్ణుఁడు లేకున్న నేమయ్యెడిది? లోభ రాజ్యసింహాసనమలంకరింపకున్న దుర్యోధనుని సంపదెట్లుండెడిది. కురువంశచ్ఛేదము సంభవించెడిదా? క్రోధ లోభ పిశాచముల విభ్రమములిట్టివి.

ధర్మరాజు శాంతమూర్తియే? ఐననేమి? దుర్యోధనుని దుర్నయము సహించుచున్నాళ్లు? రాజ్యము లేకున్న నడవుల నివసించును కాని ధర్మపత్నిని రచ్చకీడ్చిన నేశాంతమూర్తి సహించును? సహించనెంచినను వీరునకు జన్మించి వీరులతో పెరిగి వీరులఁ జెట్టబట్టి వీరపుత్రులగాంచిన వీర వనిత యూరకుండునా? ఏకవీరులగు భీమార్జునులు సహింతురా? దుర్యోధనుఁడు మార్గమునకు వచ్చునా అన్నియు శశవిషాణ కల్ప

ములే! చేయున దేమున్నది? భవితవ్యతాబలమున ధర్మజుని మనమునఁ గ్రోధాగ్ని ప్రజ్వరిల్లినది. కురు మహారణ్యమును దహించినది. కురు మహారణ్యమన నేల? సమస్త క్షత్రాంకురముల నూచముట్టుగ దహింపలేదా? ధర్మజుని చిత్తమును దహించిన క్రోధమునకు దహింపరాని దేమి?

మరణాంతాని వైరాణి యన్నటు లజాత శత్రునకు వైరులతోపాటు కోపమంతరించినది. కన్నులువిప్పి చూచినాఁడు. నిత్యశ్రీల కాలవాలమగు నాకురు రాజ్యమేది! ఆవైభవమేది! సర్వమును దుర్యోధన చక్రవర్తి తనతో లోకాంతరమునకుఁ గొనిపోయినాఁడు. ధర్మజునకు మిగిలిన దేమి? రుద్రభూమి! చేయదగినది రాజకర్మ కాదు. పితృకర్మ. వినఁదగినవి వందిమాగధ స్తోత్రములు కావు. ఆర్తరోదనధ్వనులు. శిరమున మోయఁదగినది తిట్టిపోతల కిరీటము. సింహాసనమున రాజచిహ్నముగ నలంకరించుకొనదగినది శ్వేతాతపత్రమునకు మారు బంధువిద్వేష దుర్యశము. ఈరాజ్యలాభమున నానందించువారెవరు? హా దుర్యోధనచక్రవర్తీ! స్థిరప్రతిజ్ఞుడవు. మరణించియు ధర్మజునకు వాడి సూది మొన మోపు సంతటి రాజ్యమైన నీయకుంటివా!

ఇది యిట్లుండ కర్ణుఁడు ధర్మజున కన్నయట! ధర్మజునకు రాజ్యాధికార మున్నదో, లేదో! పోనీ, వంశాంకురమైన లేదే! అజాతశత్రునిపిదప రాజ్య మేమగును? ఈ యొనర్చిన దంతము నధర్మమేనా? ధర్మరాజు పేరునకు మాత్రమే ధర్మరాజు కాబోలు! కష్టము! ఇందువలననే భీష్మాదులు ధర్మజునకు రాజ్యమిప్పింప లేకఁబోయిరా?

అకారణముగఁజచ్చిన నిన్నిళవములమధ్యనున్న కఠిన కిరాతునకైన హృదయముద్రవించును. శ్మశానవైరాగ్యమైన కల్గును. ఇక సధర్మ భీరువగు ధర్మజునకో? పశ్చాత్తాపము కలిగినది. ధైర్యము సల్లటిలినది. దుఃఖము పొంగిపొర లినది. ప్రాకృతునివలె వాపోయి పలవించినాఁడు. మరణించిన దుర్యోధనునిభాగ్యము నగ్గించినాఁడు. రాజ్యభారము దుర్భరమని చింతించినాఁడు. తమ్ములరాజ్యమేలుండుచి తానడవికిపోనెంచినాఁడు. ఇందుకీయుద్ధమేల? పాపము ధర్మజునకు చిత్తవైకల్యము కలిగినది. ధర్మజునకే కాదు. క్రమముగఁజదివిన పాఠకునకు కూడ కల్గును. పాఠకునకేయన నేల వ్యాసమహర్షికి కలిగినచిత్త విక్షేపమే గదా భాగవతమున కవతరణిక.

ధర్మజుని చిత్త విక్షేపము వ్యాసమహర్షికి గోచరించినది. "పాంశుపయోదనీలతనుభాసితుఁడై" "ఉజ్జ్వలదండధారుఁడై" యరుదెంచినాడు.

క్రమమున నైన శాత్రవులఁ గ్రమ్మననైననుఁ జావ సేత ధర్మమువిను పాపకర్ములగు రాజులతో తగసంధి సేత దోషము విభుఁడుర్విఁయమ్మకొని సంగరముందొలగింపకుండుటో! సమరజితావనీ భరణశాలితఁబోలునెయుండు ధర్మముల్.

అనియుపదేశించిధర్మజునకు తాత్కాలికచిత్తశాంతి కూర్చి రాజ్యధురమున కొడబఱచి స్వాశ్రమమున కేగినాఁడు మహర్షులు మహారాజులతో నజర్యమొనర్పరుగదా!

ఈపశ్చాత్తాపము లేకున్న భారతమున మూఁడు పర్వములు తగ్గెడివి. ధర్మరాజుడు కిరాతుఁడయ్యెడివాఁడు. కవిలోకమున వ్యాసమహర్షి అనుపలక్షితమానవ స్వభావుఁడయ్యెడివాఁడు. కావ్యశిల్పమున ధర్మజప్రతిమ హృదయ విహీనమయ్యెడిది. భారతమున శాంతి రసము గగన కుసుమ మయ్యెడిది. పాఠకుల హృదయము పాషాణ మయ్యెడిది.

ధర్మజునకు మనశ్శల్య ముద్ధృతము కాలేదు. శ్రీకృష్ణుని దర్శింప నేగినాఁడు. సమాధినిష్ఠుఁడగు భగవానునిఁ జూడ ధర్మజిజ్ఞాసయే కాక బ్రహ్మజిజ్ఞాసయు కలిగినది. సందేహముల దీర్చుకొనుటకై భీష్మునొద్దకు పోనెంచినారు. ధర్మనిష్ఠుఁడు రక్తపాతమున కైన వెఱువరాదని యుపదేశించుటచే కాబోలు భార్గవుని క్షత్రసంహారమున నేర్పడిన రక్తహ్రదముల ధర్మజునకు మార్గమధ్యమున శ్రీకృష్ణ భగవానుఁడు చూపినాఁడు. యుద్ధసన్నాహమున తనకు నొక చేయికలదని కాబోలు ధర్మజుని ధర్మోపదేశమునకై కొండంతదైవమగు శ్రీకృష్ణుఁడు కొనయూపిరితోనున్న భీష్మునొద్దకు కొనిపోయినాఁడు.

పితృభక్తిచే నాజన్మబ్రహ్మచర్యముస్వీకరించి భ్రాతృస్నేహముచే పరసురామునితోఁబోరి పుత్రప్రేమమున కురు రాజ్యమున కేడుగడయై నిలిచి పౌత్రవాత్సల్యముచే జితమృత్యుఁడయ్యును రణరంగమున స్వమర్మోద్ఘాటన మొనర్చి, శరతల్పమున హంసతూలికాతల్పమునందువలె శయనించియున్న గంగానందనుకన్న ధర్మజుని మనమునకు శాంతిఁ గూర్చు నాప్తుఁడెవ్వఁడు? పవిత్రుఁడెవ్వఁడు? పాత్రుఁడెవ్వఁడు.

పనిపడి త్రవ్వి కూపమునందు నుదకంబు
పానంబు సేయని వానిభంగి
యున్నతతరువెక్కి జున్ను చేకుఱగొని
తేనియ యానని వానిభంగి
ఆఁకొని యొడఁగూర్చి అన్నంబు తళియకు
వచ్చినఁ గుడువని వానిభంగి
శమకించి యొకభంగి తనవశంబుగఁ జేసి
మానిని గవయని వానిభంగి
.....ఘనశక్తి శౌర్య సం
పన్నులైన పగఱ భండనమున
నోర్చిపూజ్య రాజ్య మొల్లక యడవికి
నేగ

నెంచు ధర్మజునకంటె ధర్మయుక్తుఁడు ప్రియవిరక్తుఁడు శాంతి సక్తుఁడు నెవ్వఁడు.

తగిన శిష్యుఁడగు మనుమనికి దేవవ్రతుఁడు రాజధర్మములును ఆపద్ధర్మములను శర్మము విడిచి చెప్పినాఁడు. దుర్యోధనాదులతోఁ బోరుట ప్రత్యవాయముకాదనియు పోరకుండుటయే ప్రత్యవాయమనియు వ్యాసమహర్షి సూత్రప్రాయముగ చెప్పినది యథార్థమని ఒప్పించినాఁడు. ధర్మజునకు తానొనర్చినది ధర్మమని కొంత ప్రత్యయము కలిగినది. కాని బంధు మరణ శోకము రగులుచునేయున్నది.

నష్టేధనే దారేవా పుత్రే పితరివామృతే

యయాబుద్ధ్యాను దేహోచ్ఛకంత స్మైబ్రూహి పితామహ!

అనియడిగినాఁడు. భీష్ముఁడు ప్రపంచము మిథ్యాకల్పితమని చూపినాఁడు. ధర్మజుని చిత్తము శాంతించినది.

పులివ్రాయి గిలిపట్టినది. తత్వజ్ఞునకు మిథ్యాలోకము గోచరించునా? ఇహసౌఖ్యములు రుచించునా? బ్రహ్మసందమున నోలలాడుచు గంధమలదినను కత్తివైచినను ఒక్కటిఁగ భావించుచు "కరతలభిక్షః తరుతలవాసః" అని శుకునివలె సంచరించునేమో! ఇహసంగమును పరిత్యజించి ముక్తుఁడైన శుకునిఁదలచి పుత్రప్రేమమున వ్యాసమహర్షియే దుఃఖించెను కదా! ఇక నాజన్మమిడుములు పడి రాజ్యమేలఁదగిన కాలమున విరాగియై ధర్మజుఁడడవికేగుట భీష్ముఁడెట్లు సహించును. మూఢలోకమునకు ధర్మప్రవృత్తియందాసక్తియెట్లుకలుగును? భరతవర్షమున ధర్మమునకు తావుండునా? భారతరణమున కాశయమేమైననుండునా?

యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరోజనః
సయత్ప్రమాణంకురుతే లోకస్తదనువర్తతే

అన్నట్లు లోకము ధర్మజునివలె విరక్తముకాకున్నను, త్యక్తకర్మము కాకుండునా?

నలినీదళమందలి సలిలబిందువువలె సంసారమున లగ్నముకాక సత్కర్మనాచరించుచు శీతోష్ణములందగులక నిస్సంగుఁడై "మిథిలాయాం ప్రదగ్ధాయాం నమేదహ్యతికించన" అనగలిగిన జనకరాజర్షి ఒక రాజమార్గమును నిర్మించెనుఁగదా.

ఆమార్గమే ధర్మజునకు లోకమునకుఁ దగినదని యెంచినాఁడు. కనుక భీష్ముఁడు ధర్మజుని జనకునివంటి వానిగా నొనర్చినఁగాని కృతార్థుఁడు కాఁజాలఁడు. వ్యాసమహర్షియు సార్వత్రికమగు నొక మానవ జీవితమును పరిపూర్ణముగ సృష్టించిన ధన్యుఁడు కాఁజాలఁడు. ఆచార్యహీనమగు పాఠశాలవలె నున్న రాజహీనమగు భారతవర్షముకూడ మార్గమునకు రాఁజాలదు. ఇదియే ఆనుశాసనిక పర్వాశయము. ఈ పర్వమే లేకున్న శాంతి పర్వముతో భారతమునకు శాంతి చెప్పవలసినదే!

కనుక

"తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి"

అను నాశయముల మనమునందిడుకొని కర్మయోగోపయుక్తములగు గృహస్థాశ్రమ ధర్మములును ఆయాశ్రమ ప్రాశస్త్యమును ఈపర్వమున వర్ణింపబడినవి. కనుక ఆనుశాసనికము కర్మయోగ ప్రతిపాదకమనియు శాంతిపర్వము జ్ఞానయోగ ప్రతిపాదకమనియు వ్యక్తమేకదా!

భీష్ముఁడు ధర్మజుని ఆధ్యాత్మోపదేశమున కైలాసమంతటి యున్నత స్థానమునకుఁ గొనిపోయి మఱల గృహాలిప్స కల్పించి క్రిందికి కొనివచ్చి కురురాజ్య సింహాసనమునఁ గూర్చుండఁబెట్టినాఁడు. ధర్మజుఁడు చక్రనేమి క్రమమున తాను బయలుదేరిన భూమిచేరినాఁడు. కాని ధర్మజునక వసుంధరపైఁ బ్రేమ పుత్రవతియగు సతిపై బతికుండు ప్రేమ

వంటివి. ధర్మజుని చిత్తవృత్తి శరత్కాలమునందలి నదీ ప్రవాహమువలె నిర్మలమైనది. జనకుఁడైనాఁడు. రాజ్యము బంధముగాఁ దోఁచలేదు. ఇక నట్టివానికి వనమైన నేమి? ఉపవనమైన నేమి? ఋషివర్తనమైన నేమి? రాజర్షివర్తనమైన నేమి? గురుశిష్యు లిరువురును గృతార్థులైనారు. ఇరువు రేకాము. సమస్తలోకము కృతార్థమైనది.

ఆమార్గమే ధర్మజునకు లోకమునకుఁ దగినదని యెంచినాఁడు. కనుక భీష్ముఁడు ధర్మజుని జనకునివంటి వానిగా నొనర్చినఁగాని కృతార్థుఁడ కాఁజాలఁడు. వ్యాసమహర్షియు నాదర్శప్రాయమగు నొక మానవ జీవితమును సంపూర్ణముగ సృష్టించిన ధన్యుఁడు కాఁజాలఁడు. ఆచార్యహీనమగు పాఠశాలవలె నున్న రాజహీనమగు భారతవర్షముకూడ మార్గమునకు రాఁజాలదు. ఇదియే అనుశాసనిక పర్వాశయము. ఈ పర్వమే లేకున్న శాంతి పర్వముతో భారతమునకు శాంతి చెప్పవలసినదే!

కనుక

"తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి"

అనునాశయముల మనము సందిగుకొని కర్మయోగోపయుక్తములగు గృహస్థాశ్రమ ధర్మములును ఆయాశ్రమ ప్రాశస్త్యమును ఈపర్వమున వర్ణింపబడినవి. కనుక అనుశాసనికము కర్మయోగ ప్రతిపాదకమనియు శాంతిపర్వము జ్ఞానయోగ ప్రతిపాదకమనియు వ్యక్తమేకదా!

భీష్ముఁడు ధర్మజుని అధ్యాత్మోపదేశమున కైలాసమంతటి యున్నత స్థానమునకుఁ గొనిపోయి మఱల గృహాలిప్స కల్పించి క్రిందికి కొనివచ్చి కురురాజ్య సింహాసనమునఁ గూర్చుండఁబెట్టినాఁడు. ధర్మజుఁడు చక్రనేమి క్రమమున తాను బయలుదేరిన భూమిచేరినాఁడు. కాని ధర్మజునకు వసుంధరపైఁ ప్రేమ పుత్రవతియగు సతిపై బతికుండు ప్రేమ

వంటివి. ధర్మజుని చిత్తవృత్తి శరత్కాలమునందలి నదీ ప్రవాహమువలె నిర్మలమైనది. జనకుఁడైనాఁడు. రాజ్యము బంధముగఁ దోచలేదు. ఇక నట్టివానికి వనమైననేమి? ఉపవనమైననేమి? ఋషివర్తనమైననేమి? రాజర్షివర్తనమైననేమి? గురుశిష్యు లిరువురును కృతార్థులైనారు. ఇరువురేకాదు. సమస్తలోకము కృతార్థమైనది.

సమరము ధర్మమేకానిండు. చేసినవి హత్యలుకాకుండునా? అజ్ఞానము ప్రచ్ఛన్నరూపమునఁ దన్నావరించిన దేమోయని ధర్మజుఁడు శంకించినాఁడు. జననమరణములకు యదార్థముగ మనుజుఁడు కర్తకాఁడని గౌతమీలుబ్ధ సంవాద ముపదేశించి భీష్ముఁడు ధర్మజునియందు కర్తృత్వము తొలగించినాఁడు. గృహస్థాశ్రమముపై నభిలాషకలిగినది. కాని అమృతత్వముపై నభిరుచి తగ్గలేదు. గృహమందుండి మృత్యువును జయింపవచ్చునాయని ధర్మజునకు ననుమానము కలిగినది. సుదర్శనోపాఖ్యాన ముపదేశింపబడినది. గృహస్థాశ్రమములో అమృతప్రాప్తిసాధనములగు షట్కర్మలనాచరించు యోగ్యతగల బ్రాహ్మణత్వముపై నుత్కంఠ కలిగినది. ఇంద్రమతంగ సంవాద ముపదేశించినాఁడు. ప్రకరణ శుద్ధికై విశ్వామిత్ర వీతహవ్యుల చరిత్రములు చెప్పఁబడినవి. ఇదియేవిధమున నాయాసందర్భముల ధర్మజుని శంకల వారించుటకై భంగాస్వనాష్టావక్రాది చరిత్రములు వర్ణింపఁబడ్డవి. పిదప గృహస్థునకొసఁగఁదగిన దానములు వాని ఫలములు వాని యాధిక్యములు వర్ణించుటచే నీపర్వములో పూర్వాపర సంగతికి భంగములేదు.

లోకమునకు రుచి భిన్నము. ప్రకృతికి పరిణామము సహజము. ఇక కాలభేదముచే రుచిభేదము కలుగుటలో వింత ఏమి? నివృత్తి తత్పరులగు ప్రాచీనులకు శాంతియందభిరుచి యధికము. కనుకనేకదా వీరరసప్రధానమగు భారతేతిహాసమున వ్యాసమహర్షి శాంతి నంగిరసముగ నొనర్చెను. ధర్మనిరతులగుటచే బూర్వులకు ధర్మబోధకములగు గ్రంథములయందాసక్తి మెండు. దీనికి తార్కాణముగ నానందైక ఫలములగు రూపకాదులకు నత్కృష్టనాయకవర్ణనము ప్రతిపాదకమన్నారు. ధర్మబోధకములు సత్కావ్యములనియు నితరము లసత్కావ్యములనియు విభజించి యసత్కావ్యముల బరిత్యజించినారు.

శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిషు
పరోపకారః పుణ్యాయపాపాయ పరపీడనమ్॥

అనుకారికకన్న లఘువుగ ధర్మనిర్వచన ముండనిచో నట్టి ధర్మనిర్వచనము భారతముకంటె విపులముగను సంభవింపదనవచ్చును.

భారతమును వ్యాసమహర్షి వైశంపాయనాదులకు చెప్పెను వైశంపాయనుడు జనమేజయునకు ననువదించెను. అపటవినిన సూతుడు శౌనకాదులకు వినిపించెను. చూడుడు

పుణ్యాత్ములార యీపుణ్యేతిహాసంబు
జనమేజయుడు జేయు సర్పమఖము
కాలంబునం దట్లు కారుణికోత్తముం
డైన వేదవ్యాసు డాదరమున

నాజ్ఞాపనము సేయు నతని శిష్యుఁడు లోక
నుతుఁడు వైశంపాయనుండు సెపె
అన్న రేంద్రుఁడు విని నాసభ నిలిచి స
వినయభక్తికముగ వినినవాఁడ
కథనశక్తియు నమ్ముని కరుణవలన
కలిగె నాకిత్తెఱంగున గారవించి
మీరు వినుచుండ చెప్పెడి మేటిపదము
కంటిమంటి మీవయకతనఁ జేసి।

తత్త్వప్రవక్తలు చెప్పునపుడు శ్రోతలకు కల్గు సంశయముల వారించుచు రాగా భారతము విపులమై సర్వసందేహ నివర్తకమైనది. వేదములందలి ధర్మము లన్నియు నిందు గతార్థములైనవి. కనుకనే

అమల ధర్మార్థకామ మోక్షముల గుఱిచి
ఒలయు తెరువెద్దియును నిందు కలుగునదియు
ఒండెడలకల్గు దీన లేకుండునొప్పు
తక్కొకంటను లేదు వేదజ్ఞులార.

అనినారు. ఇందువలననే భారతము సర్వోత్కృష్టమగు గ్రంథమై పంచమవేదమను ఖ్యాతివడసినది.

భారతము బహుకర్తృకమనవలెను. కానిండు. పనేమి? ఇంతియకాదు. ధర్మజాదులు వాస్తవ్యులుకాక కల్పితపాత్రములైనను ఇంకేమైనను ధర్మజ్ఞులకుఁగాని రసజ్ఞులకుఁగాని కల్గులోపమేమి? కల్పితము కానిదేమి? మనము భారత

మును కల్పిత మనుచున్నాము. భారతము మనలోకమునే కల్పితమనుచున్నది. సత్యమేమైన మనకేమి? మనమానంద మనుభవింతము. కృతార్థులౌదము.

ఏమతమువారైనను తత్తన్మత సిద్ధాంతములను తెలిసికొనుటచే కృతార్థులు కాజాలరు. అన్నపానాది విషయ వర్ణనముచే క్షుత్పిపాసాదులు తీరునా? గ్రంథములు మార్గమును చూపును. సాధకుఁడు ఫలము నొందును. భారతము భారతీయ పవిత్ర జీవితమును చిత్రించినది. అందులో గృహస్థధర్మ ప్రతిపాదకమగు నానుశాసనిక పర్వముకంటె సాధకుఁడగు గృహస్థునకు సన్మార్గదర్శకమేమున్నది?

(ఉభయ భాషాప్రవీణ)

సంస్కృతకళాశాల, తెనాలి. } తూములూరు శివరామకృష్ణమూర్తి శాస్త్రి





హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్ర

# మహాభారతము

## ఆనుశాసనికపర్వము, ప్రథమాశ్వాసము.



మత్కూటాత్మరోచి
స్తోమసముల్లాసవిహిత • సుస్థిరలక్ష్మీ
భూమానందితభక్త
వ్యామోహవిదూరయుక్త • హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు దివ్యజ్ఞానదేదీప్యమానుండైన దేవవ్రతుండు వివరింప వివిధంబు లగుధర్మంబు లాకర్ణించి యజాతశత్రుం డతనికి సభక్తికప్రణామం బాచరించి వినయవిశేషవిభూషితుండై. 2

సీ. అనఘ నా దగుచిత్త • మునకు శమంబుగా
వించుటకై నీవు • వివిధవిశద

భంగులఁ బరమకృ ♦ పానిరతుండవై
సకలధర్మోపదే ♦ శములుఁ జేసి
తిమ్మెయిఁ జెప్పఁగా ♦ నించుక యేనియు
శమము లే కున్నది ♦ చలముకొని య
నేకబంధుల వధి ♦ యించితి నది యొక్క-
తలయు నీ కలిగిన ♦ దారుణత్వ

ఆ. మొక్క-తలయు నైన ♦ యుగ్రకర్మంబులు
చిత్తవృత్తిఁ దగిలి ♦ యుత్తలంబుఁ
జేయ శాంతి యెట్లు ♦ సిద్ధించు మునిమాన
నీయ యింక నేమి ♦ సేయువాఁడ. 3

వ. దుర్యోధనుం డతిలోభంబున నాతోఁ బంచి కుడువనో డంబడండ యేనును నాగ్రహంబున నతనికి రాజ్యం బిచ్చి తొలంగి నిలువను మాయిద్దఱకతంబున నింతవుట్టెం బశ్చాత్తాపం బెప్పాటనుం ద్రోపువడ దయ్యెడు. 4

—* గౌతమీలుబ్ధకసర్పమృత్యుకాలసంవాదము *—

చ. అనవుడు భీష్ము డిట్టులను ♦ నాతనితో నకటా వధింపఁగా
మనుజుఁడు కర్త గాఁడువిను♦మాయితిహాస మొకండు సెప్పె
దఁ గా।మనుజవరేణ్య గౌతమియ♦నంగ శమాన్విత యొక్క-
భూసురాం। గన యురగంబుచే సుతుఁడు♦ గాలవశత్వముఁ
బొందియుండఁగన్. 5

చ. వగచుచుఁ జూడ నయ్యురగ♦వల్లభు రజ్జునఁ గట్టి తెచ్చియు
మ్మగువకుఁ జూపి దీనిఁ దల♦ ద్రుంచదఁగ మోఁదెదఁగోల

నొండె రెం । డుగ 1నెఱగత్తి వ్రేసెదఁ గ ♦ డుం జెడు
గీఁడ పాఁపపుర్వు నే । మిగతి వధింతు నంచు నొక ♦ మేటి
కిరాతుఁడు రోషదీప్తుఁ డై. 6

క. ఉన్నఁ గని యప్పుడఁతి యో
యన్న విడువు భుజగనాథు ♦ ననవుడు నతఁ డీ
పిన్నాతని ప్రాణంబులు
గొన్నది యిది దీనియసురు ♦ గొనియెద ననియెన్. 7

వ. అనిన నక్కోమలి యక్కిరాతుం జూచి. 8

క. విధివశమున వచ్చినకీ
డథములు గొనియాడి వ్రేఁగు ♦ లై విపులభవాం
బుధి మునుఁగుదురు మునుంగరు
సధర్ములగునుత్తములు ప్ర ♦ శాంతిఁ జులుకనై. 9

వ. అదియునుం గాక. 10

క. ఈపాముఁ జంప బ్రదుకునె
నాపుత్రుఁడు విడువు మర్జు ♦ నక నావుడు వాఁ
డీపేదమాట లెల్లను
గోపవివశుఁ డై ననాకుఁ ♦ గొలుపవు ముగ్ధా. 11

ఉ. కావున నెట్లుఁ జంపుమన ♦ కానిభుజంగముఁ బోవనీను జూ
నావుడు నింతి యర్జునక ♦ నాయము నీ కవదాతభంగికిం
గా వలదేమహీసురులు ♦ గా దనుచొప్పునఁ దత్సహాయులుం
బోవరుగా దెయేలనిను ♦ బోఁటికి క్రూరత నాదుసన్నిధిన్. 12

1. అ. నరగత్తి.

సీ. హింసకు నోడఁబడ ♦ నే నెట్లు ననవుడు
జనబాధకము లైన ♦ జంతువులను
జంపినఁ బాపంబు ♦ సమకూర దని పల్కె
బోయ వట్టినరిపుఁ ♦ బోరిగొనంగ
వల దని చెప్పె న ♦ వ్వనిత వాఁ డహిఁ దెగఁ
జూచి జనంబులఁ ♦ గాచు టుఱదె
వృత్రుఁ జంపఁడె దేవ ♦ విభుఁడు యజ్ఞధ్వంస
నము సేయఁడే ఫాల ♦ నయనుఁ డట్ల
తే. కావె ధర్మవు హింసలు ♦ నీవు దీని
కియ్యకొనుమ మని తఱిమె న ♦ క్లింత దఱిమి
నను దయావతి యైనయ ♦ న్నాతి పాప
మునకుఁ జొరదయ్యె బోయకి ♦ ట్లనియెఁ బాము. 13

క. ఏ నేమితప్పు సేసితిఁ
గానవు నెఱి నీవు లెస్స ♦ గామృత్యువరా
ధీనత బాలునిఁ గఱచితిఁ
గాని వినుము లేవు రోష ♦ కామాదు లెదన్. 14

వ. అనుటయు నతండు. 15

క. విను మృత్యువునకుఁ దగుసా
ధనమ వగుటఁజేసి నిన్ను ♦ దండింపగాఁ
జను ననవుడు గుమ్మరికో
లను సారెం బోలితిం ద ♦ లఁచి చూడు మెడన్. 16

వ. ఈక్రియ నావశం బగునే యని పల్కెనం బాముస కర్జున
కుం డిట్లనియె. 17

తే. ఏయువాఁ డుండ న మ్మేమి ♦ సేయు ననక
యోపి తత్ఖండనము సేఁత ♦ పాప మండ్రె
యెవ్వరేఁ బంపఁ గఱతు గా ♦ కేమి క్రూరు
నిన్ను గీటడఁగించిన ♦ ♦ నిందరాదు. 18

తే. అదియుఁ గాక విశేషించి ♦ యరయ బుద్ధి
గలుగునట్టిసాధనములు ♦ గారె మీరు
మృత్యువున కట్లు గావున ♦ మెలఁగ నిడుక
నీక పొరిగొన వలయు మి ♦ మ్మెల్లభంగి. 19

వ. అనిన విని బోయకు భుజగం బిట్లనియె. 20

తే. బుద్ధి గల్గుసాధనముల ♦ పో వావిస్సు
లరసి వేల్తురు ఋత్విజు ♦ లాఫలంబు
గాంచు నధ్వరకర్తయ ♦ కాక వారి
కేమిపని యనఁగా మృత్యు ♦ వేఁగుదెంచె. 21

క. చనుదెంచి పామునకు ని
ట్లను నిను నేఁ గోరి పని:ని ♦ నట్టుల నన్నుం
బనిచెం గాలుం డీచా
వున కీవును నేను హేతు ♦ వులు గా మనఘా. 22

క. ఇనశశిపావకభూమిగ
గనజలపవనాదివస్తు ♦ గతు లెల్లను గా
లునియాజ్ఞచేతి వనినఁ ద
క్కినపని సెప్పంగ నేటి ♦ కిని భుజగేంద్రా. 23

క. విను మిట్లగు టేర్పడ నెఱిఁ
గిన [1]నాపై నిడుదు వెట్లు ♦ కిల్బిషముం గా

1. క. గ. చ. నీపై నిడుదు వెట్లు.

ధంబుమరణ మొందఁ ◆ దగుకిల్బిషంబున
బాలు రిట్ల [1]పోదు ◆ రేల కలఁగ. 37

వ. అని వెండియు. 38

క. సకలజనంబులుఁ గర్మము
నకు ననుగుణ మైన తెరువు ◆ నం బోదురు దీ
నికి రోషవిషాదము లే
టికి విడువుము పాము సంఘ ◆ టింపుము శమమున్. 39

క. అన విని తెలిసి విడిచె న
ర్జునకుఁడు భుజగము నపాస్త ◆ రోషుం డగుచుం
జని రెలమిఁ బొంది కాలుం
డును మృత్యువుఁ గావునను వి◆డువు మీ వడలున్. 40

తే. కారు దుర్యోధనుఁడు నీవుఁ ◆ గారణములు
బాంధవులరణమరణసం ◆ ప్రాప్తి కనఘ
వారు దమతమకర్మముల్ ◆ గారణములు
గాఁగ నిట్లయి రేల శో ◆ కంబు నీకు. 41

వ. గౌతమీలుబ్ధకభుజంగమృత్యుకాలసంవాదం బనునితిహాసంబు తాత్పర్యంబు మనంబునం బట్టుకొలిపి యీ పుట్టినకలంకం దొలంగ జడిసి శమంబున సుఖివి గమ్మని నం గౌంతేయాగ్రజుండు సంతసిల్లి శాంతనవునితో నిట్లనియె

—◆అగ్నిదేవుఁడు సుదర్శన యనుకన్యకను వివాహంబు సేసికొనుట.◆—

చ. అనఘ గృహస్థధర్మమున ◆ యందుఁ జరించి నరుండు
మృత్యుసం।జనితభయంబు వాపికొనఁ◆జాలునో చాలఁడో

1. యగుదు.

యన్న నాసరి। త్తనయుఁడు దానికిం దగువి ♦ ధంబు దిరం
బగు నేనిఁ జాలు న।య్యను వ్రుడఁగూడునట్టి యితి♦హాసము
విన్ము నరేంద్ర చెప్పెదన్. 43

మ. మనువంశంబునఁ బుట్టి సర్వజనతా♦మందారమై నేల యె
ల్లను బాలించి జగత్త్రియీప్రణుతలీ♦లం బొల్చె దుర్యో
ధనుం। డనురాజవ్విభునొప్పు నర్మదకుఁ గా♦మావేశముం
జేసినన్। వనితారూపము దాల్చి పొందె నతనిన్ ♦ వైద
గ్ధ్యహృద్యంబుగన్. 44

క. ఆరమణికి నతనికిఁ గ
న్యారత్నం బుద్భవించె ♦ నమరపురంధ్రీ
శ్రీరామణీయకము ని
స్సారం బగునట్లు గాఁగ ♦ జగతీనాథా. 45

క. విను దానికిఁ బేరు సుద
ర్శన యన్నరనాయకుండు ♦ సంప్రీతి మెయిం
బెనిచి తనయగ్నిహోత్రం
బున పరిచర్యలకుఁ బనిచె ♦ బుజ్జనములతోన్. 46

వ. పనిచిన నప్పొలంతి యప్పనుల వెంట మెలఁగు చుండెనట్టి
యెడ. 47

సీ. అర్చించునప్పుడ ♦ య్యంగసకెంగేలి
జిగిసొంపు చిత్తంబు ♦ దిగిచికొనఁగ
నరసి కన్గొనునప్పు ♦ [1]డయ్యింతికనుఁగవ
పొలపంబు రాగంబు ♦ ప్రొదలఁ జేయ

---

1. డయ్యింతికలికి కన్పొలపంబు.

నన్యూలఁ బనిఁ బంచు ♦ నప్పు డమ్ముద్దియ
పలుకులతీపు గో ♦ ర్కులఁ [1]గెరల్ప
నల్లన యూఁదెడు ♦ నప్పు డక్కోమ్మవా
తెఱతావి ధైర్యంబుఁ ♦ ద్రిప్పుకొలుప

తే. మరుఁడు దోడ్తోడఁ దేఁకువ ♦ మాలి కదిసి
తూపుగములఁ గ్రొవ్వాఁడిమి ♦ సూప నంత
కంత కగ్గల మగువల ♦ వంతఁ దూల
పోయెఁ బావకుఁ డేమి సె ♦ ప్పుదు నరేంద్ర. 48

వ. ఇట్లు మదనాగ్ని నుదిలకొని యగ్నిదేవుం డక్కాంతతో
నేకాంతంబున ని ట్లనియె. 49

సీ. చిగురుటాకుల గాసి ♦ సేయునీయడుగుల
చెలువంబు సూడ్కులఁ ♦ జేర్చికొనియె
మారేడుపండుల ♦ గారాము సెఱచునీ
యొలచన్నుఁగవ వేడు ♦ కలఁ బొనర్చె
నునుఁదీవఁ జీరికిఁ ♦ గొననినీమైఁదీవ
మురిపంబు డెందంబు ♦ మరులుకొలిపె
నెఱనందురుని సిగ్గు ♦ వఱుపంగఁ జాలునీ
నెమ్మోము దాలిమి ♦ వమ్ము సేసె

తే. నాతి నీకు నై పెక్కు బ ♦ న్నములు వడిితి
నంగజునిచేత [2]వల్లభ ♦ వగుము నాకు
నావుడును సిగ్గుగదిరి యా ♦ ననము వాంచి
యలఁతియెలుఁగున ని ట్లను ♦ నాలతాంగి. 50

---

1. వెరల్ప. 2. గ. వల్లభీ.

క. కులకన్యకలకు వేడుకఁ
[1]దలవీడులఁ బరులతోడి ♦ తగుమాటలకుం
దలకొనఁ దగునే గురుజన
ముల కాక త్తెఱఁగువారు ♦ పురుషార్థనిధీ. 51

వ. అనిన విని హుతవహుం డట్ల కాక యనియె నాసమయం
బున. 52

ఉ. ఆనరనాథునకుం డొక మ ♦ హాధ్వర మెంతయు వేడ్కఁ
జేయఁగాఁ। బూని మహీసురావలికిఁ♦ బూజ లొనర్పఁగఁ
దాను బ్రాహ్మణుం। డై నయ మారఁగా ననలుఁ ♦ డా
తనిపాలికి వచ్చి నాకు నీ। వే నృప నీదుపుత్రిఁ గృప ♦
యేర్పడ దానము గాఁగ నావుడుఁ. 53

వ. అవ్విభుండు. 54

తే. అన్యవర్ణుండు దీనుఁ డీ ♦ యనకు నెట్లు
గూఁతు నీ వచ్చు నని మదిఁ ♦ గుత్స పుట్టి
యీఁడ ప్రార్థన మఫల మై ♦ యేఁగి యజ్ఞ
సమయమున నగ్ని దనమూర్తి ♦ సంహరించె. 55

క. కని యజ్ఞపతి ఋత్విజు
లును దానును వెఱగుపడి వి ♦ లోపము వాటి
ల్లెనొకో కర్మగతుల నని
మనమున నూహించి భవ్య ♦ మంత్రముఖరుఁడై. 56

వ. పావకునిం బ్రస్తుతించు చుండ నద్దేవుం డాభూదేవతలకు
నల్లన తన తెఱం గెఱింగించిన.

---

1. క. గ. దలవీళ్ళన వరుల.

తే. వార లానృపుతోఁ జెప్ప ♦ [1]గారవంబు
సంతసముఁ దలకొనఁగ న ♦ య్యింతిఁ బెండ్లి
సేసె విప్రకుమారుఁడై ♦ చెన్ను మెఱసి
యగ్నివరియించె నచ్చెరు ♦ వంద జనులు. 58

వ. ఇట్లు సుదర్శనావివాహోత్సవం బనుభవించి విభావసుం
డు విభ్రాప్రభాసమానుండగుచు హుతంబులు పరిగ్రహింప
దుర్యోధనుయాగంబును సుప్రయోగం బై చెల్లెఁబడంపడి.

క. అనలునకు సుదర్శనకును
జనియించె నుదాత్తగుణవి ♦ శాలుండు సుద
ర్శననామధేయుఁ డానృపుఁ
డనూనధర్మమునఁ దాల్చె ♦ నవనీభరమున్. 60

వ. [2](ఆసమయంబున.)

ఆ. అతని కోఘవంతుఁ ♦ డనువాఁడు జనియించె
నుదితయశుఁడు వాని ♦ కోఘరథుఁడు
నోఘవతియు ననఁగ ♦ నుదయించి రయ్యోఘ
వతికి నావిభుండు ♦ వరుని నరసి. 62

వ. ఒరుల మెచ్చక. 63

క. ఆలేమ సుదర్శనునకు
నాలింగా నిచ్చె నద్ద ♦ హాననందనుఁడుగ్
లోలతఁ గైకొని పరిణయ
కేలి నడపి విమలబుద్ధిఁ ♦ గృతనిశ్చయుఁడై. 64

1. జ. గారవమున సంతసంబును దళుకొల్పి యింతి. 2. ఖండలీకరణములలోనివెల్ల వ్రాఁతప్రతులం గనుపట్టవు.

వ. గృహస్థధర్మానుష్ఠానంబునన మృత్యువు జయింతు నని ప్రతిజ్ఞ సేసి యోఘవతియునుం దానును కురుక్షేత్రంబునకుం జని యందు రమణీయప్రదేశంబున విశాలపర్ణశాలఁ గావించుకొని యుండె నట్టియెడ నయ్యోలనాఁగతో నతం డి ట్లనియె. 65

తే. అతిథిఁ బూజించువేడ్క నా ♦ కగ్గలంబు
వెలఁది నీవును ననుకూల ♦ వృత్తిఁ దాల్చి
పొలయ కప్పని నడపఁగా ♦ వలయుఁ బూని
యే నిచట నున్నయప్పుడు ♦ లేనియపుడు. 66

క. అతిథిజనులు దమతమవాం
ఛితము లనుభవించునట్లు ♦ సేయం గనినం
గృతకృత్యతఁ బొందరె గృహ
పతియును గృహిణియును [1]ధర్మ ♦ భారమువలనన్. 67

క. అతిథి నినుఁ గోరె నేనిని
మతిఁ గింకిరిపడక యోల ♦ మానక నీ
వతనికిఁ బ్రియంబు సల్పుము
సతికిం బతిపనుపు సేయఁ ♦ జను నెల్లదియున్. 68

—* సుదర్శనునింటికి ధర్మదేవత యతిథి యై వచ్చుట. *—

క. అని యాఁది చెప్పి యొకనాఁ
డనఘు యతం డిధ్మములకు ♦ నటవీస్థలికిం
జనినయెడ నతిథి యొక్కఁడు
సను దెంచిన నాసనాది ♦ సంభావనలన్. 69

1. జ. గర్మభావమువలనన్.

క. అతివినయంబున సమ్మా
నితుఁ జేయఁగ నాలతాంగి • నెమ్మోమునఁ జూ
పతఁడు నిలిపి కామాతుర
మతి నైతిం బ్రియు మొనర్పు • మానిని నాకున్. 70

వ. గృహస్థధర్మప్రకారంబు నీయెఱుంగనియదియే యని పలికిన నప్పరమపతివ్రత వేఱొండు దెఱంగుల నభ్యర్థనీయంబులయినవస్తువు లుపన్యసించిన నతం డవి యెవ్వియు నొల్లననుటయు. 71

క. సతి దన పతివచనంబులు
మతిఁ జొనుపుం దెంపు మాను • మాన వెఱచు న
య్యతిథివనుపు సేయక త్రో
చుతలం పలవఱుచుఁ జేయఁ • జూచుం దలరున్. 72

తే. ఇట్టు లురియాడుచిత్తంబు • నెట్టకేని
నాథుచెప్పినధర్మంబు • నకుఁ జొరంగ
నూలుకొల్పి నిర్ణయమునః • గీలుకొన్న
లజ్జవేఁగునఁబోలె త్రవా • లంగ మోము. 73

క. తెఱవ యొడఁబాటుమాటం
బఱివ్రాయినకొంకుతోడ • బ్రాహ్మణుఁ గొని క
న్మఱుఁ గగునెడకు నరిగె న
త్తఱి వచ్చె సుదర్శనుండు • ధరణీనాథా. 74

ఆ. వచ్చి పర్ణశాల • వాకిట నిల్చి య
త్తన్విఁ బిల్చె నతిథి • దాని నల్ల
నూర కుండు మనియె • నువిదయు భూసుర
శాపభీతి నెలుఁగు • నూపకుండె. 75

సీ. పేర్కొని పలుమాఱుఁ ♦ బిలిచి యో యనుట లే
కున్న నయ్యింటిలోఁ ♦ గన్నువఱపి
వల్లభుఁ గానక ♦ వహ్నితనూజుండు
దలఁ కొంది ప్రేముడి ♦ పలుకు వలుక
నతని నుద్దేశించి ♦ యతిథి నాకాతిథ్య
మొనరించుచున్నది ♦ వనిత నీవు
గృహధర్మవిదుఁడవు ♦ కినియకు మయ్య మ
మ్మనుడు నప్పరమపు ♦ ణ్యాత్మకుండు

తే. నీదు కతమున నేను స ♦ మ్మోదమగ్న
మానసుఁడ నైతి [1]నతిథులు ♦ మహితపూజ
నములు గాంచినగృహములు ♦ విమలతరము
లండ్రు బుధు లింత యెఱుఁగుదు ♦ నట్ల నడతు.

వ. అని పలికి వెండియు. 77

ఉ. నావచనంబునట్టుల మ♦నంబును దీనికిసాక్షు లుర్వియుం
బావకుఁడుఁ జలంబును న♦భంబును వాయువుఁ జంద్ర
సూర్యులున్ । నావుడు మోసె నాకసము♦నన్ విశదం
బుగ దివ్యవాణి సం । భావితుఁ డీతఁ డీవిభుని♦పల్కునిజం
బని కౌరవేశ్వరా. 78

ఆ. అప్పు డతిథి ప్రీతి ♦ నతనిసన్నిధి కేఁగు
దెంచి దుర్నిరీక్ష్య ♦ తేజ మడరఁ
దనదుమూర్తి యధిక ♦ తరసమున్నతిఁ బొలు
పెసఁగ నిల్చి యతని ♦ కిట్టు లనియె. 79

---

1. క. నతిథుల...గావించుగృహములు.

సీ. ధర్మదేవత నేను ♦ దగ నీదుచిత్తంబు
నారయ వచ్చితి ♦ ననఘ నీవు
నిశ్చలవ్రతుఁడవు ♦ నీప్రతిజ్ఞకు హాని
గలిగినఁ దెగఁజూడఁ ♦ దలఁచి తిరుగు
వెనువెంట మృత్యువు ♦ విను జయించితి దానిఁ
గామరోషాది వి ♦ కార సహిత
ముగ నంతరంగంబు ♦ మున్న గెల్చితి భవ
త్సతియుఁ బవిత్ర య♦స్ఖలితచరిత
ఆ. యొడలితోడ నీకు ♦ నూర్ధ్వలోకమునకు
నరుగ వచ్చు నెప్పు ♦ డరుగుతలఁపు
దోఁచె నప్పు డిదియుఁ ♦ దోడిద యై ప్రీతి
నరుగుదెంచు ననియెఁ ♦ గురువరేణ్య. 80

వ. అని వెండియు. 81

చ. నరవర పోల్చు నోఘవతి ♦ నా నది యై జనపావనాకృ
తిం । బరమతపంబులోని సగ♦పాలను నియ్యమ యున్న
సాముస । న్వైరవునఁ దొంటివై నిలిచి♦నీకుఁ దగం బరి
చర్య సేయు ని । చ్చరితము మీకు నిర్మలయ ♦ శంబు
నొనర్చుట కే నొనర్చితిన్. 82

వ. అని చెప్పి ధర్ముండు ధవళహయసహస్రంబు పూనిన
మానసీయరథంబునం జనియె నోఘవతి యుద్దేవుని చెప్పి
నట్ల వర్తిల్లె సుదర్శనుండును బరమ సంతోషభరితుం
డయ్యెఁ బాండవాగ్రజా నీమనంబున నెక్కొలుపు మిక్క
థయభిప్రాయంబు. 83

ఆ. అతిథిపూజఁ గడచి ♦ నట్టిధర్మువు గృహ
స్థులకు నొండు లేమి ♦ దెలుపు చున్న
యది సమస్తకీర్తి ♦ పాపహ మీయితి
హాస మిచ్చు నెల్ల ♦ యభిమతములు 84

క. అనినఁ బితామహునితో న
జ్జనపతి బ్రాహ్మణ్య మవులజాతులు మూఁటన్
జనియించినవానికి దొర
కొనునొకో యతివిమలకర్మ ♦ గుణయోగమునన్. 85

వ. అని యడిగిన నతం డతని కిట్లనియె. 86

తే. బ్రాహ్మణత్వంబు గడు దుర్ల♦భం బనేక
జన్మములఁ బొంది తిరుగంగ ♦ సంభవించి
నఘుఁడు గనునది యున్నత♦మైన యుప్ప
దంబు విను మెఱిఁగించెద ♦ దాని తెఱఁగు. 87

—* ఇంద్రమతంగ సంవాదం బనునితిహాసప్రకారము. *—

వ. అది యింద్రమతంగసంవాదం బనునితిహాసంబాకర్ణించిన నెఱుంగ నగుం గావున నక్కథ యుపన్యసించెద నొక్క విప్రునికొడుకు మతంగుం డనువాఁడు యజ్ఞార్థం బైనపని కిం దండ్రిపనుపునం బోయి పోయి. 88

క. మదమునఁ బెలుచన యొకగా
డిదకొదమం గోల గొని యడిచె నడిచిన నో
వ్వోదవి తనతల్లిఁ జేరఁగ
నది నని న న్నితఁ డడిచె ♦ నని చెప్పటయున్. 89

వ. ఆగార్దభి దనకొడుకుతో వీఁడు చండాలుండు ప్రచండస్వ భావుండు గా కుండునే యనినం బూర్వజన్మకర్మవిశేషం బునం దిర్యగ్జాతిభాషావిదుం డగుట నవ్విప్రపుత్రుం డప్ప ల్కులు విని యిది దూషణభాషణంబు గాదు నిరూపణా లాపం బై యున్నది యట్లు గావున మాలతనంబు గలుగ నేర్చు నని నిశ్చయించి యగ్గాడిదకడకుం బోయి. 90

క. తవకుం జండాలత వ
చ్చినకారణ మడిగి దాని • చేతం గంద
ర్పునిఁ బోలెడు వాఁ డిట నిజ
జననికిఁ బాం దగుట విని వి•షాదముతోడన్. 91

వ. తనపోయెడుపనికిం బోవక మరలి సదనంబునకుం జని జన కుని కత్తెఱం గెల్ల నెఱింగించి యతనితో శూద్రబీజం బున బ్రాహ్మణియందు జన్మించినవాఁడు చండాలుం డగు టకు సందియం బేమి గార్దభి శాపజాత గా నోపు నది యున్న రూప పలికె బ్రాహ్మణ్యంబు దపంబున సంపాదిం చెదం గాక యనిపల్కి వీడ్కొని వనంబునకుం బోయి. 92

క. పరమతప మాచరింపఁగ
సురపతి వొడచూపి యడుగు • సువ్రత నీకుఁ
వర మిచ్చెద ననిన ధరా
మరత్వ మి మ్మనియె నతఁడు•మది ముద మొదవన్. 93

చ. అనవుడు బ్రాహ్మణత్వము మ • హాత్త్వ మెఱుంగవ
యన్యజాతి కందునె యది యొండు వేఁడు మది•దోఁచిన
మే లనియెఁ బలారి వాఁ డ నితరసాధ్య మైనతప•మస్ష

లితంబుగఁ జేయు చుండెదం।జనుము మహాత్మ నీ వనిన ♦
సస్మితుఁ డై యతఁ డేఁగె నేఁగినన్. 94

వ. మతంగుఁ డేకపాదంబున నూఱేండ్లు తపంబు నేసిన నిం
ద్రుండు గ్రమ్మఱ వచ్చి. 95

తే. ఏను వల వని చెప్పిన ♦ మాన వెట్లు
పరగుదుర్లభ పద మాస♦పడి కరంబు
మేలితప మాచరించెదె చం♦డాలుఁ డిట్టి
దాన నళియించు నిది నీకుఁ ♦ దగదు విడువు. 96

వ. విను మిత్త్రఅంగుతపంబునకుఁ బదిమడుంగులు నేసి చండా
లుండు శూద్రుండగు నూఱుమడుంగు లనుష్ఠించి
శూద్రుండు వైశ్యుం డగు వేయిమడుంగు లాచ
రించి వైశ్యుండు క్షత్త్రియుం డగు (నప్పుణ్యాచరణంబు
నకుఁ) బదివేలు మడుంగులు నిర్వర్తించి క్షత్త్రియుండు
దుర్బ్రాహ్మణుం డగు (నానియమంబునకు) లక్ష మడుం
గులు సల్పి శమదమసత్యాహింసల నమాత్సర్యంబున
నార్యబ్రాహ్మణహృదయంబులు సదయంబులు గావించి
దుర్బ్రాహ్మణుండు సద్బ్రాహ్మణుం డగు నిట్లు బ్రాహ్మ
ణ్యం బలఁతులంబడయ వచ్చునే పడసియు నది సెడకుండ
నడప శక్యంబగునే యనేకజన్మంబుల నొకప్పుడు। బ్రా
హ్మణజన్మంబు నొందియుం గొందఱు ధనవాంఛా విషయ
లౌల్యాదులందదాచారంబు దిగవిడిచి చెడుదు రిట్టిమహా
పదంబు గోరినిన్ను నీవ యేల వినాశంబు నొందించుకొని
యెద పీశపోనిష్ఠ సాలించి తగునది యొక్కవరంబు వేఁడు

మనియె ననిన వాఁ డూరకున్న నాఖండలుం డరిగె
వెండియు. 97

క. అంగుష్ఠ మొకటి మోపి మ
తంగుఁడు నూఱేండ్లు సేసెఁ ♦ దపము నియతిమై
సంగముతో లసులతో
సంగతముగఁ దోఁప వెక్క ♦ సముగా నరముల్. 98

ఆ. ఇట్లు సేసి శక్తి ♦ యెల్లను గడచన్న
నతఁడు నేల వ్రాలె ♦ నతిరయమున
వచ్చి యమరఁ బట్టి ♦ వాసవుఁ డక్కట
నీకుఁ జెప్పనయ్యె ♦ నెమ్మినేను. 99

వ. క్షత్త్రియాదులచేతనుం బట్టు వడని బ్రాహ్మణ్య శార్దూలంబుతోడి మేలంబు దక్కుము నీకు నొక్కవరం బిచ్చెదం గైకొను మని పల్కుటయు, నతం డొడఁబడినం బరమాదరంబున. 100

ఆ. చండదేవుఁ డనఁ బ్ర ♦ శస్తివహించి సు
స్త్రీలు పూజనంబు ♦ సేయఁ గామ
రూపధారి వైని ♦ రూపింప విహగభా
వంబు గల్గి ప్రమద ♦ వర్తి వగుము. 101

క. అని వర మిచ్చి మహేంద్రుఁడు
సనియె ననిన విని యజాత ♦ శత్రుఁడు గాంగే
యునితో బ్రాహ్మణ్యము పెఱ
జనులకుఁ బొందంగ నిట్లు ♦ శక్యం బేనిన్. 102

—* విశ్వామిత్రునకు బ్రాహ్మణ్యంబు గలిగిన తెఱంగు. *—

వ. విశ్వామిత్రుం డెట్లు వొందె నత్తెఱం గెఱింగింపవే యని
యడిగిన నన్నరదేవునకు దేవవ్రతుం డిట్లనియె. 103

సీ. జాహ్నవీదేవికి ♦ జనకుండై వెలసిన
జహ్నునికులమున ♦ సంభవించె
గాధి నాఁ బ్రకటభూ ♦ కాంతుఁ డాతనిపుత్రి
యగుసత్యవతిఁ దన ♦ కాలిఁ గాఁగ
ఋచీకుఁ డనుముని భృగు ♦ కులవరేణ్యుఁ
డతని కీ నొల్ల క ♦ ప్పతి దనకూఁతున
కుంకువగాఁ జెప్పె ♦ నొక్కకర్ణ

తే. మసితమై తెలుపారెడు ♦ హరులు వేయి
మానిదై భార్గవుఁడు దేరఁ ♦ బూని వరుణుఁ
గానఁ జని యవ్విధము ఘోట ♦ కముల వేఁడె
నాతఁ డిచ్చుట కొడఁబడి ♦ యతనితోడ. 104

క. నీవలసినప్పు డట్టిహ
యావలి ప్రభవించు నెచట ♦ నైన ననవుడున్
దీవించి యరిగి యమ్ముని
దేవతటినియుత్తరంపుఁ ♦ దీరమునఁ దగన్. 105

వ. నియతుండై తలంచినతత్క్షణంబ గాధి సెప్పినచందం బగు
గుఱ్ఱంబులు వేయునుం బుడమిం బొడమి పొలిచి నిలిచె
చానం గన్యాకుబ్జంబున కనతిదూరం బగు తత్ప్రదేశం
బశ్వతీర్థం బనం బరఁగె నమ్మునికుమారుం డత్తురంగ

బుల నిచ్చిన నచ్చెరువును సంతోషంబును శాపభయం
బును ముప్పిరిగొనం దనపుత్రికి నుంకువగా నియ్యకొని. 106

తే. గాధి యమ్మునిపుత్రుతు శీ ♦ ఘ్రమునఁ బెండ్లి
సేసె నిట్లు వరించి బుఁ ♦ చీకుఁ డధిక
సమ్మదమున గృహస్థ ధ ♦ ర్మమ్ము నడపు
చుండి సంతానకాంక్ష స ♦ య్యువిదతోడ. 107

వ. నీకుం బుత్రోత్పత్తి గావింపం జాలుచరువు సంపాదించెద
ననియెఁ దొల్లిదాని తల్లి దనయల్లుని మహానుభావం
బెఱుంగుటం జేసి యాసత్యవతితో నాకుం దనయుండు
గలుగఁ దయ సేయునట్లుగాఁ బుణ్యకర్త యగునీభర్తం
బ్రార్థింపుమనినయది గావున నమ్మాట యమ్ముద్దియ
యతనికిం జెప్పిన నప్పరమ ధర్మపరుండు. 108

తే. రెండుచరువు లొనర్చె యొ ♦ క్కండు బ్రాహ్మ
ణత్వ మత్యుజ్జ్వలముగ నొ ♦ నర్ప నొకటి
రాజభావంబు నధికతీ ♦ వ్రముగఁ జేయఁ
జాలునట్లుగ నిజతప ♦ శ్శక్తిఁ జేసె. 109

వ. ఇట్లుగావించి యారెంటిని సత్యవతికిం జూపి తత్ప్రభా
వంబు వేఱువేఱ యుపన్యసించి క్షాత్త్రం బయినచరువు
మీతల్లి కిచ్చి [1]బ్రాహ్మం బయినదాని నీవుపుచ్చుకొనుము
ఋతుకాలంబున నీతల్లి యశ్వత్థంబును నీ వుదుంబరం
బును నాలింగనంబు సేసి భక్తితో మీామీాచరువు లుప

1. క. గ. ట: బ్రాహ్మణ్యం బయినదాని.

యోగించునది యని నియోగించె వారియుపయోగంబు
సమయంబున విధివశంబునం జేసి. 110

క. చరువులు నమ్మని చెప్పిన
తరువులు వీడ్వడియె సుతకుఁ ♦ దల్లికి నట్ల
య్యిరువురు నుపయోగింపఁగఁ
గరువు లగు దత్తత్ప్రకార ♦ కలితము లయ్యెన్. 111

వ. దివ్యబోధమహనీయుండు గావున. 112

ఆ. చ్యవననందనుండు ♦ సత్యవతీగర్భ
భంగి సూచి యకట ♦ బ్రాహ్మణుండు
గాఁడు తరుణి నీదు ♦ కడుపులోపలిబిడ్డ
క్రూరుఁ డైనరాచ ♦ కొడుకు గాని. 113

వ. అని పల్కి చరుతరువ్యత్యాసంబున నట్లగుట దేటపడం
జెప్పిన నబ్బోటి యత్యంతవిషాద వేదనాదూయమాన
మానసయై. 114

క. నీకుం బుట్టెడికొడుకు వి
వేకనిధి బ్రాహ్మణత్వ ♦ విరహితుఁ డైనన్
లోకము మెచ్చునె యట్టులు
గా కుండఁగఁ జేయు తపము ♦ గౌరవ మొప్పన్. 115

తే. నాకు నివ్వర మిమ్మని ♦ నమ్రయగుచు
వీఁడు బ్రాహ్మణుఁ డగుఁ గాక ♦ వీనికొడుకు
నందు రాజత్వసంపద ♦ యతిశయిల్లు
ననియెఁ గరుణార్ద్రచిత్తుఁ డై ♦ య త్తపస్వి. 116

వ. అట్లమ్ముని యావహించుటకతంబున సత్యవతీపుత్రపౌత్రు
లైనజమదగ్నిపరశురాములు క్రమంబున బ్రహ్మక్షత్త్ర

తేజోవిరాజితు లయిరి గాధి భార్యకు జనియించి విశ్వామిత్రుండు. 117

క. నరనాథుం డై యుండియుఁ
జరుతరుగుణసంక్రమమున ♦ సద్బ్రాహ్మణతా
స్ఫురణంబు వడసెఁ దపమును
గర మధికం బతనియందుఁ ♦ గలిగెఁ గుమారా. 118

—* వీతహవ్యుం డనురాజునకు బ్రాహ్మణత్వంబు గలిగినప్రకారము *—

వ. అనిన విని ధర్మజుండు వీతహవ్యుం డనురాజు బ్రాహ్మణత్వంబుఁ బడసె నని విందు న త్తెఱం గెఱింగింపు మన వుడు నతనికి శంతననందనుం డిట్లనియె మనుసంభవుం డైన శర్యాతియన్వయంబున హైహయుం డనునొక్క జనపతి జనియించి వత్సదేశాధీశుం డయి యేలిచె నాతనికి వీత హవ్యనామంబునుం గలిగి యుండుఁ దదీయ భార్యలు పదుండ్రు వారలు వీరులుం బ్రబలులు నగుపుత్రుల నూర్వురఁ గాంచి రమ్మహారథులు విక్రమకుతూహలంబున. 119

సీ. వార్యశ్యుఁ గాశీశు ♦ నాజికిఁ బిలిపించి
యొక్కయుమ్మడి లావు ♦ నుక్కు మెఱయఁ
బొదివి చంపిరి వాని ♦ పుత్రుండు పట్టంబు
గట్టి సుదేవుండు ♦ క్రమ్మఱంగ
నురవడి నరిగి య ♦ ధ్ధరణీశు ననిఁ దెగఁ
జూచి రా హైహయ ♦ సుతులు గడిమి

నాతనినందనుఁ • డగుదివోదాసుండు,
రా జైన నమ్మహీ • రమణువీడ,
ఆ. నడచివారు ఘనర • ణం బొనరించి సై
న్యంబుఁ ద్రుంచి రోడి • యతఁడు వాటి
ప్రకటసంయమిని భ • రద్వాజమునిఁ గని
యధికభక్తి నతని • నాశ్రయించి. 120
క. తనకులము వీతహవ్యుని
తనయులచేఁ ద్రుంపఁబడుట • దగ నెఱిఁగింపన్
విని యతఁ డోడకు నీ కొక
తనయునిఁ గల్పింతు రిపువి • దారణనిపుణున్. 121
వ. అని పుత్రకామేష్టి సేసినం బ్రభవించినపుత్రుం డప్పుడ పదుమూఁ డేండ్లప్రాయంబువాఁ డయ్యెఁ బ్రతర్దననామధేయుం డగునక్కుమారుం డమ్మహాత్ముని యనుగ్రహంబున వేదంబులు ధనుర్వేదంబును వేగంబ యధిగమించి.
చ. మునికృపనావహింపఁగ స•ముజ్జ్వలతేజముఁబొందిపేర్మిమై
జనకుఁడు యౌవరాజ్యపద•సంగతుఁ జేసినఁ బేర్చి యవ్విభుం
డనుమతిసేయ నెత్తిచని • యాజిముఖంబునవీతహవ్యనం
దనతతి నెల్లఁ గీటడఁచె• దర్పమెలర్పఁగ నశ్రమంబునన్.123
క. తనయులఁ దెగటార్చి వడిం
దనమీఁదం గవిసినం బ్ర • తర్దనుశౌర్యం
బున కళికి వీతహవ్యం
డనయము వెసఁ బాఱె భృగువు • నాశ్రమమునకున్.124
ఆ. పాఱి భీతి దోఁపఁ • బల్కి నమస్కృతిఁ దగ
వైనశిష్యసమితి • లోన నునిచె

నతనిఁ గాశిరాజ ♦ సుతుఁడును వెనువెంటఁ
దగిలి యచట కరిగి ♦ తగువిధమున. 125

క. మునిపతికిని వినయము సే
సిన నిట రాకకుఁ గతంబు ♦ సెప్పుమనియె న
జ్జనవంద్యుఁ డక్కుమారుం
డనఘా మధ్యస్థవృత్తి ♦ నై వినవలయున్. 126

వ. అని పలికి తమకులంబు వీతహవ్యుని కొడుకులచేత నశిం
చినవిధంబు దానువారల నందఱ ప్రమందించుటయును వీత
హవ్యుం డాహవంబునం దనకు నోడి పాఱుటయును జెప్పి
మునీంద్రా యారాజిటవచ్చె నాతనిం బొలియించుటకై
వచ్చితిననిన నత్తపోధనసత్తముండు. 127

క. వినుమిచ్చట నృపకులసం
జనితుఁడు లేఁ డింతయుఁ బ్ర ♦ శస్తఃహీందే
వనికాయమ కనుఁగొను మని
తనశిష్యప్రతతిఁ జూపె ♦ దయ చిగురొత్తన్. 128

వ. చూపినం జూచి. 129

ఆ. అతఁడు నగుచు భృగుని ♦ యడుగుల కెఱఁగి మ
హాత్మ దీననేఁ గృ ♦ తార్థవృత్తి
నైతిఁ బగతు నిట్లు ♦ జాతికిం బెడఁబాపి
గాసిగాఁగఁ జేయఁ ♦ గంటిఁ గాన. 130

క. కలుగునె యమోఘ మగు నీ
పలుకున కన్యతత్వ మేను ♦ బనివినియెద న

న్నలఘుకృపఁ జూడు మని తగఁ
బలికిన ముని ప్రీతి నాన్నృ • పతి వీడ్కొలిపెన్. 131

సీ. వీతహవ్యుఁడును మ • హాతపస్సందీప్తుఁ
డైన యమ్మునీంద్రు • నప్రతర్క్య
భంగిభాషణముల • బ్రాహ్మణుఁడై కృత్స్న
మదసమాఖ్యఁ గాంచె • మహితసుతుని 132

వ. తత్పుత్రపౌత్రక్రమంబున సుతేజసుండును వర్చసుండును విహవ్యుండును వితత్యుండును సత్యుండును సంతుండును శ్రవసుండును దమసుండును బ్రకాశుండును వాగింద్రుండును బ్రమతియును రురుండును సముద్రుండును శునకుండును శౌనకుండును నన మహాద్విజులు జన్మించి రిట్లు విద్యావర్తిశ్రేణివంశం బగు మునివంశంబునకు మూలంబయి యవ్వీతహవ్యుండు భవ్యమూర్తిపడసెఁ బాండవాగ్రజా యింక నెయ్యది యడిగెద వడుగు మనుటయు నతండు దైవంబును బౌరుషంబు ననురెంటియందు నెయ్యది యధికంబు సెప్పు మనిన నప్పురుషవరుండు దొల్లి యిట్లు వసిష్ఠుండు బ్రహ్మ నడిగిన నమ్మహాత్ముం డుపదేశించిన వాక్యంబులయర్థంబు లుపన్యసించెద నాకర్ణింపు మని యిట్లనియె.

—*భీష్ముఁడు ధర్మరాజునకు దైవపౌరుషంబుల తెఱంగెఱింగించుట.*—

క. క్షేత్రంబు పురుషకారము
ధాత్రీశ్వర బీజ మరయ • దైవము రెండుఁగా
సూత్రపడఁ గూడెనేని
బాత్రంబగుఁ గర్మకరుఁడు • ఫలమున కెందున్. 133

క. [1]వినుపురుషుఁడు గావింపని
పనులకు దైవ మది యెట్లు ♦ ఫలమొనరించుఁ
జనములు గార్యము నడపఁగ
ననుకూలత నిచ్చుఁగాక ♦ యయ్యైఫలముల్. 135

తే. పౌరుషమ్ము దైవంబుతో ♦ డ్పాటు లేక
ఫలముఁ బొందంగ నేరదు ♦ పార్థివేంద్ర
విత్తు సహకారి గాకున్న ♦ రిత్తనేల
వంధ్యమగుఁగాక తాఫల ♦ వంతమగునె. 136

తే. మేలు రెండులోకంబుల ♦ మేల తెచ్చుఁ
గీడు సేసినఁ దప్పదు ♦ కీడ యగుట
గాన పురుషవర్తనమున ♦ కానుకూల్య
శీల మగుదైవ మది ఫల ♦ సిద్ధిఁ జేయు. 137

క. అనలం బించుక యైనఁ బ
వనుచే వెలుఁ గొందుమాడ్కి ♦ వర్ధనముం బొం
దును సత్కర్మాచరణం
బున దైవమునానుకూల్య ♦ ము గురుప్రవరా. 138

క. నేయి పొలుపడిన దీవియు
మాయుకరణిఁ [2]గర్మసిద్ధి ♦ మలిగిన హీన
త్వాయత్తంబై తానును,
మాయును దైవానుకూల్య ♦ మహిమ మహీశా. 139

తే. పరశురాముఁడు భృగుఁడును ♦ బలియులోను
గాఁగ మహనీయపురుషులు ♦ గర్మసూక్ష్మ

---

1. క. చ. జ. విను పురుషులు గావించని, పనులను. 2. గ. చ. జ. గర్మశుద్ధి

భంగిఁ గలుషితదైవప్ర ♦ బాధితాత్ము
లైరి కర్మంబు దైవంబు ♦ నలఁచు నెట్లు. 140

క. విను పౌరుషమును దైవము
నన రెండును గార్యఫలము ♦ నందింపఁగ నె
ట్టన కారణములు గావున
జననాయక సదృశములు వి ♦ చారింపంగన్. 141

వ. అనిన విని ధర్మతనయుండు సత్కర్మంబుల నయ్యాముష్మికఫ
లంబులు విన వలతు ననుటయు నక్కురు సత్తమునకు
నక్కురుపితామహుం డిట్లనియె. 142

సీ. అధ్వపరిశ్రాంతుఁ ♦ డగుపంతవానికి,
నన్నం బిడినఫల ♦ మట్రి దిట్ట
దనఁ బెద్ద యగ్నిస ♦ మారాధనమునకుఁ
బౌరుషశ్రేష్ఠత ♦ భవ్యదాన
ములకుఁ దత్త్వస్తు ♦ వులమహోమహిమలు
మౌనంబునకుఁ బరి ♦ జ్ఞానశక్తి
యతులతపంబున ♦ కధికభోగము లహిం
సకు రూపబలదీప్త్యై ♦ శ్వర్యసిద్ధి

ఆ. బ్రహ్మచర్యమునకుఁ ♦ బరమాయు వుపవాస
ములకుఁ జిత్తశుద్ధి ♦ ఫలజలంబు
లాహరించి యునికి ♦ కాధిరాజ్యము పత్త్రి
భక్షతకు దివంబు ♦ ఫలము లధిప. 143

క. శ్రుతిపఠనమునకు నర్థ
ప్రతిబోధంబునకు వరుస ♦ ఫలములు సౌఖ్య

స్థితియును సుగతియు సత్య
వ్రతమునకు ఫలంబు ముక్తి ♦ వసుధాధీశా. 144

క. ద్రుమముల దళకుసుమఫలో
ద్గమములు క్రియఁ గర్మముల నొ ♦ దవుఁ దత్ఫలముల్
దమతమతెఱఁ గర్తకు భో
గ్యములై నియతిని శుభాశు ♦ భాకారములన్. 145

వ. అని చెప్పి. 146

చ. వినుము జరానుబంధమున ♦ నెండ్రుకతండము బండ్లు
వీనులుం । గనుఁగవయున్ జరం బొరయుఁ ♦ గాని రయొ
కప్పుడుఁ దృష్ణ జీర్ణ గా । దనయముఁ బేర్చి ప్రాణముల♦
సన్నక పో దది రోగ మల్పబు । ద్ధి నరులు । దోవ లేరది
మ ♦ దిం జొర నీరు సుఖార్థు లై బుధుల్. 147

క. పాపంబుఁ బుణ్యమును దృ
ష్ణాపరులకు దుఃఖసౌఖ్య ♦ సంపాదులగున్
భూపాల వితృష్ణులు ని
ర్లేపు లగుట వారిఁ బొంద ♦ లే వాఫలముల్. 148

వ. అని పల్కినం బాండునందను లందఱుం బ్రహర్షోత్కర్షం
బు నొందిరి గంగా నందనుండు ధర్మనందను నుద్దేశించి
యీయర్థజాతంబు మునిప్రణీతం బయి యధిగతం బైనది
నీకు నుపదేశించితి నీ వింక నేమి విన వల తనవుడు నా
భూవల్లభుండు నిజాశ్రయంబున కాస్పదం బయినపురుషు
నెడభక్తజనంబుచరితం బెట్టిది గావలయు నని యడిగిన
నతండతని కిట్లనియె. 149

—*భీష్ముఁడు ధర్మజున కాశ్రయం బెవ్వఁడు నపరిత్యాజ్యంబని చెప్పుట*—

క. విను కాశీశ్వరు దేశం
బున నొక లుబ్ధకుఁడు వేఁట ♦ వోయినచోటన్
ఘనతరవిషదిగ్ధశరం
బున నేసిన మృగముఁ దప్పి ♦ భూజముఁ దాఁకెన్. 150

క. పూవులఁ గాయలఁ బెరిగిన
యావృక్షము శుష్కమయ్యె ♦ నవ్విషమున ధా
త్రీవర తదీయకోటర
మావాసము గాఁగ నొకమ ♦ హాశుక ముండున్. 151

క. అది తరువు విడిచిపోవక
హృదయంబున భక్తిపేర్మి ♦ నెండనుగాలిన్
బెదరక ధృతిమై నయ్యెడఁ
గదలక యుండె ననుజీవి ♦ గౌరవ మెసఁగన్. 152

ఉ. దానియుదాత్తవృత్తము శ ♦ తక్రతుఁ డాత్మ నెఱింగి వ
చ్చి బెం। డ్లైనది యిమ్మహీజము మ ♦ హాతరువుల్ ఫల
వృద్ధి నొంది యు। క్కాన ననేకముల్ గలుగఁ ♦ గా ని
టు లేటికి నిందు నిల్వ నో। మానితకీరమా యని యె♦మా
నుషభంగికరూప మొప్పఁగన్. 153

వ. అనిన విని యాశుకంబు.

చ. అనయముఁ బండు చుండు నెడ ♦ నాశ్రయ మొప్పిన ని
ల్చి యెండి పో।యినతఱిఁ బాసి పోక తగ ♦ వెట్లు కృతఘ్న
త గాదె యివ్విధం। బనిమిషనాథ యన్న నతఁ ♦ డచ్చె
రు వంది పురాకృతోపసం। జనితవిశేష మాఖగము ♦
జానుగ నన్ను నెఱింగె దీనికిన్. 154

వ. మే లొనర్చెదం గాక. 156

క. అని తలఁచి నీదుపలుకులు
విని మెచ్చితి వరము గోరు • విహగోత్తమ నీ
వనిన శుకంబు మహీజం
బునకుం బేరెలమి వేఁడె • భూపవరేణ్యా. 157

ఆ. అమరవల్లభుండు • నమృతసేచనమున
భూజమునకుఁ దొంటి • పొల్పుకంటె
మిగుల నెలమి సేసె • మేలియాశ్రితులిట్లు
మనుతు రధిపుఁ గురుకు • మారవర్య. 158

—*విభులకుం బాటింపవలయువారిని భీష్ముఁడు ధర్మరాజునకుఁజెప్పుట.*—

వ. అనిన నతం డెవ్వారిఁ బాటించుట విభులకు వలయు నని
యడిగిన నాభూపతికి భీష్ముం డిట్లనియె. 159

సీ. జననాథ విను తప • స్స్వాధ్యాయముఖకర్మ
కరణత నుభయలో • కముల వశగ
తములఁ జేయఁగఁ జాలు • ధాత్రీసురులు మన్న
నకుఁ బాత్రములు పతి • నాతి కెట్లు
రాజునకును నట్లు • బ్రాహ్మణుం డొడయుండు
బ్రాహ్మణుం డనుమాట • పావనంబు
హర్షించి శుభముల • నలిగి యాపదల నిం
ద్రునకైనఁ జేయు వి • ప్రుండు నృపతి

ఆ. కొడుకుఁబోలె వరయ • గురుఁబోలెఁ గొలువంగ
నగ్నిఁబోలె నిష్ఠ • నర్చితుఁడుగఁ

జేయవలయు విప్రుఁ ♦ జెప్పెద వేదసం
వాద మేకబుద్ధి ♦ నాదరింపు. 160

వ. వేదంబులు దమలోనఁ గోష్ఠిసేయు సమయంబున. 161

సీ. బ్రాహ్మణజాతికిఁ ♦ బరిభవం బొనరింప
మున్ను చేసినపుణ్య ♦ ములు నశించు
జపహోమముఖకర్మ ♦ సంచయంబున కధి
కతర బు విప్రము ♦ ఖమున నిడుట
[1]భూసురార్చన మొక ♦ మాసంబు సల్పినఁ
బాపంబు లెల్లను ♦ బాసి పోవు
నగ్రవర్ణులఁ గాంచి ♦ యాదరింపక యుండు
కంటెను గీ డొండు ♦ గలుగ దరయ

తే. నని క్రమంబున ఋగ్వేద ♦ మును యజుస్సు
సామము నథర్వణమ్మును ♦ సారభూత
భవ్యసంభాషణము సేత ♦ దివ్యమునుల
వలన విందుము కౌరవ ♦ కులపవిత్ర. 162

—* భీష్ముఁడు ధర్మరాజునకుఁ బరమమైనధర్మంబు సెప్పుట *—

సీ. అని చెప్పి భీష్ముఁ డ ♦ మ్మనుజేంద్రుతోఁ బర
మశ్రేష్ఠమైనధ ♦ ర్మంబుఁ దెలియ
విను మని పల్కి యి ♦ ట్లను మధుసూదనుండు
సత్యవతీ పుత్రు ♦ చరణములకు
నెఱిఁ గేలు మోడ్చి ♦ యెద్దాని నెఱుఁగుట
యెఱుకల కెల్లను ♦ నెక్కు డని స

1. చ. జ. భూసురారాధనమున నొక్క మాసంబు పాపంబు.

భక్తికసమ్మతిఁ • బ్రార్థించి యడిగిన
నమ్మహాముని దయ • నతనిఁ జూచి

ఆ. విష్ణు నెఱుఁగు టధిక • విమలబోధము యజ్ఞ
మూర్తి యజ్ఞకర్త • మూర్తి యజ్ఞ
కలనమూర్తి యజ్ఞ • ఫలమూర్తి విష్ణుఁ డ
తండు కృష్ణుఁ డమల • తరచరిత్ర. 163

వ. అని పల్కి యమ్మహాత్ముండు వెండియు శల్యున కిట్లనుఁ గృష్ణుండు వినుచుండఁ గొందఱు బ్రాహ్మణు లతని నుపలక్షించి నాతో నిబ్బాలుండు యాదవుం డైన వసుదేవునకుఁ గంసానుజ యైన దేవకియందు జన్మించినవాఁ డితని నీవు క్రతుపురుషుం డని కొనియాడుటకుఁ గతం బేమి యని యడిగిన నన్నారాయణుండు నగుచు నన్నుఁ గన్గొని వీరల ప్రశ్నంబునకు నుత్తరంబు దగ నిత్తు గాక యనిన న ద్దేవునకుం బ్రణమిల్లి యే ని ట్లంటి. 164

ఆ. వేదమయుఁడు వేద • వేద్యుండు వేదార్థ
విత్తమ ప్రియుండు • విష్ణుఁ డీతఁ
డిట్టిఁ డగుట యాత్మ • నెఱుఁగుట యుత్తమ
బ్రాహ్మణత్వసిద్ధి • భవ్యులార. 165

వ. అనిన విని వారలు తద్భావనం గృతకృత్యులై రని చెప్పిన మద్రవిభుండు మానసంబు మాలిన్యరహితంబును బ్రసాదసహితంబును నయి చరితార్థుం డయ్యెఁ బాండవాగ్రజా నీకు నీయర్థంబు విజ్ఞాతం బగుట యెఱుంగుదు నైనను బ్రజ్ఞావిశుద్ధికరణం బాచరించితి నని చెప్పుటయు నతం

డత్యంతసంతుష్టాంతరంగుండయి గరుత్మంతుండు మహాను
భావుం డని విందు నవ్విహగవిభునివృత్తాంతంబు తెఱం
గెఱుంగ విన వలతు వివరింపవే యనుటయు నతం
డచ్యుతు నాలోకించి యాసుపర్ణుండు నీవ కా విని యుం
డుదుం జెప్పెద ననవుడు నప్పుండరీకాక్షుండు వికచవద
నుం డై యట్ల చేయు మిక్కురుపతికోర్కి దీర్చుట క ర్త
వ్యం బని పల్కిన నా దేవవ్రతుండు భూవల్లభున
కిట్లనియె. 166

—• భీష్ముఁడు ధర్మజునకు గరుత్మంతుని చరిత్రంబు సెప్పుట. •—

సీ. కశ్యపుభార్యలు • కద్రువ వినత నాఁ,
గల రాతపస్వి వా • రలకు వరము
గరుణ నిచ్చెద నన్నఁ • గద్రువ వేవుర
వినత యిద్దఱ వేఁడి • కొనిరి సుతుల
మునియు న ట్లగుఁగాక • యనియెఁ బదంపడి
యండముల్ వేయును • నండయుగము
వరుసన యాకద్రు • వకు వినతకుఁ బుట్టె
నవి కుండముల నిడి • యరసి యుండి
తే. రహి సహస్రసమేనూతేడు • లయిన నుదయ
మయ్యె నవ్వేయిద్రుగుడ్డుల • నధికబలముఁ
దేజమునుగల్గి యాసర్ప • రాజి యొప్పు
చుండె నారెండు విరియక • యుండెమఱియు.
క. తననవతి యైనకద్రువఁ
గని వగపును మత్సరంబుఁ • గదిరెదు మదితో

వినత గడుఁ జేగరపడి
యనీతి నొకయండ మవియ ♦ నడిచె నరేంద్రా. 168

వ. అడిచిన నందు. 169

క. పులుఁ గొక్కఁడు పూర్వాంగము
గలిగి జనించుటయు వానిఁ ♦ గని యాసతి గ
న్నుల నశ్రుజలంబులు పె
ల్లొలుకఁగ శోకమున మునుఁగు ♦ నుల్లముతోడన్. 170

వ. నివ్వెఱపడి యుండ నయ్యండజంబు 171

చ. ఇరువుర మేము పుట్టుదుమ ♦ హీనపుమేనులతో మహా
బల । స్ఫురణ వెలుంగ నప్పనుపుఁ ♦ బొందఁగ నీ కవి
యించి తిట్లు మ । త్వరమునఁ జాపలంబునను ♦ దత్సల
మందుము నీసపత్నికిన్ ।వరవుడవై చరింపు మని ♦ వార
నినెవ్వగ శాప మిచ్చినన్. 172

క. పెలవెలఁ బొఱుచు వడఁకుచు
నలుకుచుఁ దనమోముఁ జూచు ♦ నయ్యంగన న
ప్పులుఁగు కృపఁ జూచి తల్లీ
వలవ దడల నిది విధాతృ ♦ వశ మయి నచ్చెన్. 173

వ. అని వెండియు. 174

శా. ఏనూతేండ్లకుఁ బుట్టుఁ నాయనుజుఁ డిం ♦ కీయున్నయం
డంబు నె । ట్లైనన్ ధైర్యము కల్గి కావుము ప్రయ♦త్నా
నక్తివై వాఁడు ద । ర్వానూనుండు బలాభిరాముఁడు

[1]మదీ ♦ యస్ఫూర్తిమనూర్తి నీ । శానందంబుగ నీఁగు
దాస్యము త్రిలో ♦ కాశ్చర్యసంపాదినై. 175

వ. అని యె నిట్లు ప్రథమపుత్రుండు వికలాంగుం డగుటకును శాపప్రాప్తికిని బరమ నిర్వేదనంబు నొంది వినతయు నవ్విహంగంబు నిర్దేశించిన కాలంబు ప్రతీక్షించి యయ్యండంబు రక్షించుకొని యుండం దత్సమయసమాగమంబున.

చ. ఘనతరకంధరుండు పృథ ♦ కాయుఁడు దీప్తముఖుండు
రక్తలో । చనుఁడు మహోత్తమాంగకుఁడు ♦ చారుసుసం
గతపక్షసారమం । డనుఁడు పరిస్ఫురద్ద్యుతివి♦డంబితబాల
దివాకరుండు లో । కనయనపర్వనిర్వహణ ♦ కారణుఁడవ
ష్టాఁడు పుట్టె భూవరా. 177

క. ఆనమయంబున నరుణో
ద్భాసితగాత్రుండు దొలుత ♦ పట్టి యరుణుఁ డు
ల్లాసి యగుచు రవిపరిచ
ర్యాసుఖ మెదఁ గోరి చనియె ♦ నంబరవీథిన్. 178

మ. జననిం బాసి జనించునప్డ తన యిచ్ఛం బక్షినాథుండు
నుం । జని పద్మోద్భవకల్పితంబు లగుభో♦జ్యంబుల్ శరీ
రంబు వ । ర్ధన మొందింపఁగ సిద్ధసాధ్యగణముల్ ♦ దగ్గ
ముద్దు సేయంగఁ గ్రీ । డనలోలత్వమునం జరించుఁ
బరితు ♦ ష్టస్వాంతుఁడై యెల్లెడన్. 179

వ. అక్కాలంబున వినోదంబునకై యరిగి యొక్కయెడ. 180

---

1. చ. మహీం॰యస్ఫూర్తిమనూర్తి.

సీ. చంచులఁ జిగురాకుఁ ♦ జించియాడుచు నలి
నెలుఁగించుగండుఁగో ♦ యిలలసొంపు
నలరుఁదేనియ గ్రోలి ♦ యన్నుసోలంబుల
మురియు తేఁటుల నును ♦ మ్రోఁతయింపుఁ
దనిపండ్లరస మాని ♦ తమలోనఁ జెలఁగుచుఁ
బలికెడురాచిల్క ♦ పదువురంగుఁ
గొలఁకులకెలఁకులఁ ♦ గూడి క్రీడించు చుం
డెడునంచతండంబు ♦ నడబెడంగుఁ

తే. దరఁగఁదేలుచుఁ బూఁదీవఁ ♦ దగులఁబడుచు
వచ్చుచిఱుగాలిసోఁకును ♦ మెచ్చిమెచ్చి
తగిలి కొనియాడుచును విన ♦ తయును గద్రు
వయును మున్నీటిచేరువ ♦ వనమునందు. 181

వ. మెలఁగు చుండి రట్టియెడ. 182

చ. కరువునఁ బోసిరో విధుని ♦ కాంతి సుధాబ్ధితరంగఁదెచ్చి
గం । డరు వొనరించిరో హరుజ ♦ టాస్థలికిం దొడ వైన
యేటిపై । న్నురువునఁ జేసిరో యన మ ♦ నోజ్ఞసితచ్ఛవి
నుల్లసిల్లుసుం । దరతురగోత్తమంబు దవు ♦ దవ్వులఁ
గాంచిరి చారులోచనల్. 183

వ. నిజేచ్ఛమై వచ్చినయుచ్చైశ్శ్రవంబు నిర్గాలోకించి. 184

క. వినత హాయమింత యొప్పునె
యనూనధవళ ప్రభాఢ్య ♦ మై యని పలుకఁ
విని కద్రువ యపరాంగం
బున నీలిమ దోఁచె ననియె ♦ భూపవరేణ్యా. 185

చ. అనవుడు నమ్మృగాక్షి యిటు ♦ లాడితి నవ్వుల కొడితో
నిజం । బునకునో నీదుచూపునకుఁ ♦ బోలినభంగియో
చెప్పు మన్న న । వ్వనిత దరస్మితస్ఫురిత♦ వక్త్రముతో
నిది యేటిమాట న । ల్లనియెడ గాన రాదె తెమ ♦ లం
బలుకం బని యేమి నావుడున్. 186

వ. వినత తెలియం జూచి. 187

ఉ. కా దని పూని పల్కుటయుఁ♦గద్రువ పన్నిద మేమి దీనికి
న్వా దిది యేల చిత్త యని♦ నన్ విని యాసతి నిక్కమేని
నీ । వేది పణంబుగాఁ దలఁచి ♦ యేర్పడఁ జెప్పితి దాని
కేను నం । వాదము సేయుదాన గరు♦వంబుగ నొక్కటి
నిశ్చయింపుమా. 188

వ. అనిన విని కద్రువ వినతవదనంబునఁ జూడ్కి నిలిపి. 189

తే. నీవు గెల్చిన దాస్యంబు ♦ నీకు నేను
జేయఁ గలదాన నేను గె ♦ ల్చినను నీవు
నాకుఁ జేయంగఁ గలదాన ♦ వీకడింది
పన్నిదము సుమ్ము మని తెగఁ ♦ బాఱి పలికె. 190

క. ఆపొలఁతి యట్లు వల్కిన
శాపము పేర్కొనిన వరుణ ♦ జననికి సుతాసా
హాపేత మయ్యెఁ జిత్తం
బా పన్నిదమునకు నేమి ♦ యనఁ గల దధిపా. 191

వ. ఇట్లు వినత యుం దెంపు సేసి యత్తెఱంగున కియ్యకొనినమె
నయ్యిరువురుఁ బంచ మహాభూతంబులు సాక్షులుగాఁ
బల్కి పన్నిదంబు సఱచిరి కద్రువ పతిపరిచర్యకుం గాలం

బయ్యె మఱి వచ్చి యశ్వంబు నాలోకింత మని నెపంబిడి
యప్పటికిం జూపు దప్పించి యవ్విధంబున మగిడి యరుగు
దెంచిరి తదనంతరంబ. 192

సీ. కుటిలంపుఁదలఁపునఁ ♦ గొడుకుల రావించి
కద్రువ యిట్లనుఁ ♦ గన్నునీరు
దొరఁగంగ వారల ♦ తో నబ్ధిపొంతకు
వినతయు నేనును ♦ వేడ్క నరిగి
యచ్చతెల్పునఁ గడు ♦ నభిరామ మగు నొక్క
యశ్వంబుఁ గాంచితి ♦ మవ్వధూటి
కేవలధవళంబు ♦ నావిని యొద్దార
మునకు నే నదె నల్లఁ ♦ దనము గంటె

తే. వెనుకదెస నన్న వా దయ్యెఁ ♦ గనలి పన్ని
దంబు నఱచితి మోడిన ♦ దాస్యవృత్తి
వచ్చు సవతికి నేనెట్లు ♦ వరవుడంబు
నేయఁ దగుఁ దోఁక నల్లగాఁ ♦ జేయరయ్య. 193

చ. అనవుడు వాసుకిప్రభృతు ♦ లక్కట ధర్మువు గాదు నీవు
నూఁచిన తెరు వట్టిగెల్పు శుభ ♦ సిద్ధి యొనర్చునె యట్లుఁ
గాక య। వ్వనితయుఁ దల్లి గాదె [1]గరు ♦ వంపుఁదనం
బునఁ జూడ మాకు ని। టనఁ దగునమ్మ యెట్లయిన ♦
నయ్యెను బాపము సేయ వచ్చునే. 194

క. ఈవిధ మెమ్మెయి నైనం
గావింపఁగ వలయు ననుట గల్గినఁ బరదే

1. అ. 'గరువంపుఁదలంపున'.

శావాసుల మగుదుము మము
నీ వింకం దగదు తల్లి ♦ నిర్బంధింపన్. 195

క. అని రట్టియెడం గొందఱు
జననిఁ దొఱఁగి యెక్కుడేనిఁ ♦ జని రాభంగిం
జనిన తనూజులఁ [1]బేర్కొని
నెనరు విడిచి యానెలంత ♦ నిష్ఠురమతియై. 196

కద్రువ తనకొడుకులకు జనమేజయునివలన నాశంబు గల్గునట్లు శపించుట.

చ. అమృతకరాన్వయంబున మ ♦ హాముని వేడ్కఁ బరుండు
పాండుభూ । రమణుని దేవి గొంతియుద ♦ రంబునఁ బుట్టి
ధనంజయాదినా । మముల వెలుంగుఁ దత్సుతుని ♦ మన్మఁడు
సంభృతధర్మమైన పే । ర్మి మెఱయ నేల యేలు జన ♦
మేజయనాముఁ [2]డరాత్యజయ్యుఁడై. 197

ఉ. ఆతఁడు సర్పయాగ మను ♦ నధ్వరముం గుపితాత్ముఁడై
పితృ । ప్రీతిగఁ జేయఁ దద్దహన ♦ భీకరభూరిశిఖాప్రవేశనం
జాతదురంతతాపమునఁ ♦ జావఁగలా రని శాప మిచ్చెద
త్త్వాతఁ వృత్తిఁ గా వెఱచి ♦ తక్కటినాగము లాభుజంగి
తోన్. 198

తే. నల్లగాఁ జేయువార మే ♦ మెల్లభంగి
నాతురంగమపతివాల ♦ మని రయమునఁ

---

1. గ. కెల్లఁ, విని పేర్కొని. 2. వ్రాఁతప్రతులందు 'అరాత్య జేయుఁడై, అని యున్నది. 'క్షయజయ్యౌ శక్యార్థే' అనుసూత్రముంబట్టి యజేయశబ్దమునకు శక్యార్థము లేకుండియు ప్రౌఢకవిప్రయోగముల శక్యార్థము గానిపించుచున్నది.

బోయి వాలధిరోమముల్ ♦ పొదివి నీల
రోమసంచయ మైరి కు ♦ రుక్షితీశ. 199

క. కద్రువ గన్గొని సంతో
షద్రుతమతి యగుచుఁ బిలిచి ♦ సవతికిఁ జూపెన్
భద్రాత్మక యవ్వినతయుఁ
దద్రోహం బెఱుఁగ లేమి ♦ దైన్యము నొందెన్. 200

క. నగుచుం గద్రువ వరవృష
వగుము విచారంబు విడిచి ♦ యనుడు వినత య
ట్లగుఁగా కని లజ్జయుఁ బెను
వగయుఁ దొలఁగఁ ద్రోచి చేసె♦ వరవృషము దగన్. 201

వ. ఇట్లు కపటవ్యాజయుంబునఁ గద్రువ సత్యవినయాదిగుణవతి యయినవినతం దనకు దాసిం జేసికొని పరిహీనంబు లయిన పరిచారికాకృత్యంబుల నిత్యంబు నలంచుచుండెం బదంప డియప్పరమసాధ్వి దనయగ్రతనయుం డాదేశించిన తెఱం గూహించి రెండవయండంబున జనియించినతనూజుం దలంచుచు నాసపాటు గదిరినహృదయంబుతో దాస్యం బనాలస్యంబున నడపు చుండ.

ఉ. యావనదర్పమందిజన ♦ మంతకు నంతకు నగ్గలింప మై
లావధికంబు గాఁగ నుప ♦ లాలన సేయఁగఁబద్మసంభవుం
డావిహగోత్తముండుహృద♦యంబునగర్వ మెలర్ప నుద్ధతుం
డై విహరింపఁజూచి యొక♦యప్పుడు నారదుఁడల్లఁ జేరినన్.

వ. అతఁడు భక్తిం బ్రణమిల్లి నిల్చిన నప్పక్షిపుంగవునకు నమ్మునిపుంగవుం డిట్లనియె. 204

డగుజమదగ్ని యందు సమస్తధనుర్వేదంబును నావహించు నవ్విశేషంబు తత్పుత్త్రునందు ఫలియించు నది యంతయు సకలక్షత్త్రియక్షయకారి యైనదైవంబుకృత్యంబు దానివలన ఋచీకగాధివధూజనానుష్ఠాన పరివర్తనంబు గలుగు నది కారణంబుగా నుగ్రక్షత్త్రధర్ముం డగుపరశురాముండు జమదగ్నికిం బరమబ్రాహ్మణ్యాగణ్యుం డయిన విశ్వామిత్త్రుండు గాధికి జనియింతురు బ్రహ్మవలుకు సత్యంబ యుష్మదన్వయంబు భార్గవకులసంబంధంబున జనశ్లాఘనీయం బయి వెలయం గలయది యేను దీర్ఘంబునకుం జనియెద నీవు సుఖివై యుండు మని చెప్పుటయు నప్పుడమిఱేఁడు భార్యాసహితంబుగ సవిశేషవినయం బగువందనం బాచరించి వీడ్కొని చనియెఁ జ్యవనుండు ను నిజేచ్ఛం జనియె నిది పరశురామవిశ్వామిత్రజన్మ ప్రకారంబు. 331

—* భీష్ముఁడు ధర్మజునకు దానవిశేషముల నెఱింగించుట *—

క. అని కురుపితామహుఁడు సె
ప్పిన విని ధర్మాత్మజుండు ♦ ప్రియ మందుచు నా
తనితో దానవిశేషము
లనఘా యెఱిఁగింపు మనుడు ♦ నతఁ డిట్లనియెన్. 332

సీ. కాంస్యోపదోహయుఁ ♦ గాంచనచారుశృం
గయు ధవళాంబర ♦ కలితయును స
దక్షిణయును నయి ♦ తగుగోవ్రుఁ బాత్రత్వ
భవ్యవిప్రునకు స ♦ ద్భక్తితోడ

నిచ్చిన దానికి ♦ నెన్నిరోమము లన్ని
దివ్యవత్సరములుఁ ♦ ద్రిదశలోక
మున వసింతురు కులం ♦ బున యేడుదరముల
జనముల సుగతికి ♦ ననుతు రధిప
ఆ. కన్య భూమి గృహము ♦ గనక మన్నము జల
మంబరంబు శయన ♦ మాసనంబు
వాహనంబు విప్ర ♦ వరునకు నీగి లో
కములు రెంట సౌఖ్య ♦ కారి యింద్రుడు 333
క. అనిన విని పాండవాగ్రజుఁ
డనఘా యిన్నింటికంటె ♦ నధికం బగుదా
ని నెఱింగింపు మనుడు న
జ్జనపతి కి ట్లను నతఁడు ప్ర ♦ సన్నాత్మకుఁడై. 334
తే. అర్థి గోరినవస్తువు ♦ లర్థితోడ
నీగి యెల్లదానములకు ♦ నెక్కుడరయ
నఖిలభూతమ్ములకు నభ ♦ యంబు నిచ్చు
టంతకంటెను మే లందు ♦ రార్యజనులు. 335
వ. అని చెప్పి విను మని మఱియు ని ట్లనియె. 336
తే. వీరశయనంబు మే లండ్రు ♦ వీనికంటె
మఱియుఁ గొన్నింటికంటెను ♦ మనుజనాథ
దానముల కావు వెదకిన ♦ దానిఁ బోల
లేవు పుణ్యకర్మములలో ♦ నేవి యైన. 337
వ. అనుటయు ధర్మజుండు దమ్ములదెసం గనుంగొనిన వార
లతనిచిత్తం బెఱింగి రణమరణస్తుతి సేయ నతండు సమ
రంబునం జచ్చినబంధుమిత్రజ్ఞాతిజనంబుల వలనిశోకంబు

వదలి వాహినీనందనవాక్యంబు లభినందించె నాదేవవ్రతుండు వెండియు. 338

క. అరియైన దీనుఁడై తను
శరణం బని వేఁడినం బ్ర ♦ సన్నాత్ము త
త్పురుషునికోరిక దీర్చినఁ
బురుషోత్తముఁ డందు రతనిఁ ♦ బురుషవరేణ్యా. 339

క. అడుగక యున్నను నాలిం
గొడుకుల రక్షింపలేక ♦ కుతిలపడుచు నె
వ్వఁడుఁ బేదతనము గలనరు
నెడరుడుపఁగ వలయునది మ ♦ హితగుణమనఘా. 340

క. నిజదారపరులు సంతత
యజనరతులుఁ గామరోష ♦ హంతలు నగుస
ద్ద్విజుల నరసి ధన మిచ్చుట
త్రిజగత్పూజ్యమగు నండ్రు ♦ ధీరవిచారా. 341

వ. అనినం బాండవాగ్రజుండు యాచనాయాచనంబులలో నెయ్యది దానార్హం బగు నని యడిగిన నతనికిఁ బితామహుం డిట్లనియె. 342

చ. అడిగిననిచ్చుకంటెనున ♦ యాచకుఁగాఁగ నెఱింగియిచ్చుటె
క్కుడుఫలమిచ్చుదానవిధి ♦ కోవిద వేఁడుట సావు వేఁడగాఁ
బడుటని పెద్దసావుదగు ♦ ప్రార్థనపూర్ణము సేయునాతఁడా
యడిగినవానిఁదన్నునుద♦యారతిఁగావఁగ జాలువాఁడగున్.

వ. అనిన విని యుధిష్ఠిరుం డతని కిట్లనియె. 344

క. దానము యజ్ఞక్రియ నాఁ
గా నతులితధర్మవిధులు ♦ గల వందు ధరి

త్రీనాథోత్తమ యధికఫ
లానూనంబై వెలుంగు ♦ నది యెయ్యది యో. 345

వ. వినవలతుం జెప్పవే యని యడిగిన నయ్యనిమిషనదీనంద
నుం డప్పాండునందనాగ్రజున కిట్లనియె. 346

ఉ. భూసురకోటికిన్ వినయ ♦ పూర్వముగా ధనధాన్యగోమణి
క్ష్మాసలిలాన్నముఖ్యములు ♦ సమ్మతినీగి సుయజ్ఞమాసనో
ద్భాసితసత్క్రియన్ నడపు ♦ భవ్యుఁడుయజ్ఞములుందపంబులుం
జేసినపుణ్యముంబడయుఁ ♦ జేయుముదానములోలినిత్యమున్.

క. అనవుడు నాతనితో ని
ట్లనుఁ గుంతీతనయముఖ్యుఁ ♦ డనఘా పెక్కుల్
వినఁబడు దానము లధికం
బనఁ దగియెడుదాన మెద్ది ♦ యన్నిటిలోనన్. 348

వ. అని యడిగిన నయ్యాపగా సూనుం డమ్మానవపతి కిట్ల
నియె.

—♦ భూదానమహిమాభివర్ణనము. ♦—

క. దానము లన్నిటికిని భూ
దానం బెక్కుడు సమస్త ♦ ధాన్యములుఁ బ్రభూ
తానేకవస్త్రధనర
త్నానూనత్వమును భూమి ♦ నవుటకతమునన్. 350

క. కనకము రజతము వస్త్రం
బును ధాన్యము వివిధరత్న ♦ ములు నిచ్చినయ
వ్వినుతఫలంబుల నెల్లను
గను నుత్తమభూమిదాన ♦ కర్త నరేంద్రా. 351

సీ. భూమి కెంతాయువు ♦ భూదానకర్తయు
నంతకాలము సుఖ ♦ మందుచుండు
నమరలోకంబున ♦ నల్పమైనను భూమి
యిచ్చిన బహుభూమి ♦ యేలు నతఁడు
రాజు విశేషించి ♦ రణమృతి యొండెను
భూదానకర్తృత్వ ♦ పుణ్య మొండెఁ
బడయంగవలయుఁ బా ♦ పఁగ నోపు బ్రహ్మహ
త్యాదిపాతకముల ♦ నైన భూమి
తే. దాన మెంతపాపాత్ముచే ♦ నైన భూమి
గొనినఁ గల్మష మొందదు ♦ వినుము మహిత
మైనభూదానవిధియును ♦ నశ్వమేధ
యాగమును సదృశంబు లం ♦ డ్రాదిమునులు. 352
క. దారిద్ర్యముచేఁ గుందుచు
నేరిని నడుగంగఁ బోవ ♦ కెంతయుఁ గృశతం
గూరినవిప్రున కుర్వర
వారనిదయ నీగిఫలము ♦ వాగ్గోచరమే. 353
తే. యాగకర్తయు శాంతుండు ♦ నైనయట్టి
విప్రుఁ బ్రార్థించి యైన ను ♦ర్వీప్రతిగ్ర
హంబు సేయించు టత్యధి ♦ కంబు భూమి
దానవిధివిశేషంబుల ♦ లోన నెల్ల. 354
క. విను మర్త్యుఁ డైనవిప్రున
కనఘా గోచర్మమాత్ర ♦ యగుమేదిని ని
చ్చినఁ బోనియట్టిపాపము
నినుపొడుపునఁ జెడనితమము ♦ నెందును గలవే. 355

క. ఆజిప్రా ప్తమృతులు గురు
పూజకులును మఱియు నెట్టి ♦ పుణ్యాత్మకులుఁ
రాజోత్తమ భూదాన
భ్రాజిష్ణునిఁ బోల రంద ♦ పరమమునీంద్రుల్. 356

వ. అనిచెప్పి భీష్ముండు వెండియు నిట్లను భూదేవి జనులకు హితంబుగా నానతిచ్చిన వాక్యంబులు భూగీత లనం బరఁగు వాని విని పరశురాముండు భూదానపరుం డయ్యె నని విందుము పాండవాగ్రజా యవి నీవాకర్ణింపుము. 357

క. నను నిండు రెండులోకము
లను జెడనియశస్సుఖంబు ♦ లం బడయఁగఁ గో
రినయట్లయినను దీనికి
నెనలేవు సుఁడీ తలంప ♦ నేధర్మములున్. 358

చ. ఇతరులదానమేనిఁదమ ♦ యీగియయేనినినన్నుమార్తురే
మతినరకాధివాసగతి ♦ మాన్పఁదలంచుట గల్గినఁ సమం
చితముగ భక్తినిచ్చుటకు ♦ శీలతమార్చుట నాకుహర్షభా
సితయుఁబరాభవవ్యథయుఁ♦జేఁతసుఁడీయిదెచాటిచెప్పెదన్.

క. వినుఁ డుభయలోకముల మే
లొనరింతుం గీడొకింత ♦ యును నిలువఁగ నీ
క నిరాసంబు నొనర్తును
నను నిచ్చిన నెట్టి దుర్జ ♦ నములకు నైనన్. 360

వ. అనియె నని యవ్వాక్యంబు లుపన్యసించి దేవవ్రతుం డన్నరదేవోత్తమునకు మఱియుం జెప్ప నవ్విషయం బున నింద్రుం డడుగ బృహస్పతి సెప్పిన వచనంబులు వినుము చెప్పెద. 361

ఆ. భూమి రత్నగర్భ ♦ పురుహూత యటు గాన
కలుగు భూమిదాన ♦ కర్తయైన
వాని కశ్వహస్తి ♦ వనితాదిసర్వర
త్నములు నిచ్చునట్టి ♦ యమితఫలము. 362

క. వసుదాయిని యైనవసుధ
నొసఁగినతనిఁ దన్న తన్న ♦ యొసఁగె ననుచు సం
తసపడు భూతము లన్నియు
నసమానము భూమిదాన ♦ మమరాధీశా. 363

క. విను రాజులకు నపశ్వం
బును జేయఁగ వలయు నధిక ♦ భూదానము రా
జనువాఁ డఘముల కాకర
మనఘా యది దక్కనొంట ♦ నది వ్యయ మగునే. 364

ఆ. పూర్వదత్తయైన ♦ భూమి నెవ్వఁడు వుచ్చి
కొనియె నతఁడు దనదు ♦ కులమువారి
నిరువదొక్కతరము ♦ నరకవాసులఁ జేయు
దాను[1]నడుమగాఁగ ♦ ధర్మనిరత. 365

క. మును దా విప్రునకిచ్చెద
నని భువి యీ కుండుకంటె ♦ నధికపుఁబాపం
బును నడుగ కిచ్చుటకు మిగి
లినపుణ్యము నొందు నరయ ♦ లే వంద్రు బుధుల్. 366

వ. అనిన విని యజాతశత్రుండు సురనదీపుత్త్రుతో దానపరు
లయిన మానవులకు దాతవ్యంబు లగువాని విశేషంబు
లెఱింగింపవే యనుటయు నతం డన్నకనకపానీయప్రపము

---

1. క. మున్నుగాఁగ.

ఖంబు లైనపదార్థంబుల విశేషంబులు గల వవి యెఱిం
గించెద నొక్కనాఁ డన్నంబువిషయం బైనదానంబు
ప్రకారంబు. 367

క. ఏ నడుగఁగ నారదముని
మానితముగఁ జెప్పినట్టి ♦ మాటలు సువ్య
క్తానూనవృత్తిఁ జెప్పెద
భూనాయక యేకచిత్త ♦ మున విను వానిన్. 368

క. మునులును దివిజులు నన్నము
వినుతింతురు లోకతంత్ర ♦ విధి గ్రతువులుఁ ద
న్ననుగలసర్వము నన్నం
బున నడచుం గాన యన్న ♦ ము విశిష్ట మిలన్. 369

ఆ. అన్నదానసదృశ ♦ మగు దాన మెందు నె
న్నఁడును లేదు గావు ♦ నను విధేయ
మన్నదాన మధిక ♦ యత్న పూతంబుగాఁ
బూని దానిచేఁత ♦ పుణ్యతమము. 370

సీ. ప్రాణంబులకు విధా ♦ రక మన్న మింటిజ
నంబుల కుడిగి యై ♦ నను సుభక్తి
నతిథికిఁ బెట్టుట ♦ యధికపుణ్యము శ్రాంతు
వృద్ధుఁ దాపసు బాలు ♦ వికలు వనితఁ
గడపఁ గా దాఁకలి ♦ గదిరి యర్థించిన
గృహమేధి కవమతి ♦ గినుక దగదు
కాలంబుతోఁ గుక్కఁ ♦ మాలఁడు దుది గాఁగ
నాఁకొనివచ్చిన ♦ ననుగుణముగ

ఆ. నాచరింపవలయు ♦ నాహారకల్పన
మునుల దేవపితృస ♦ ముత్కరముల
నన్నదానవిధుల ♦ నాదరంబునఁ బ్రియ
మొందఁ జేతఁ బోల ♦ వ్రెందువిధులు.

క. కులమును విద్యయు వృత్తము
నలఘుమతీ యన్నమిడుట ♦ కై యడుగంగా
వలవదు విప్రుని [1]నాదర
మలరంగా నిడుట లెస్స ♦ యడిగినమాత్రన్. 372

వ. అని వెండియు 373

తే. అజుఁడు గల్పాదియం దన్న ♦ మమృత మనియె
నన్నహాని బలాధికు ♦ నైన దుర్బ
లాత్ముఁగాఁ జేయుఁ గావున ♦ [2]నన్నభుక్తి
సకలధాతువృద్ధికి నయి ♦ జనము గోరు.

క. అని యతఁడు వల్కె నని యును
విని యన్నము సవినయముగ ♦ విప్రాదులకుఁ
మనుజేశ యిడుదు నీవును
మన మలరఁగఁ బెట్టుమీ స ♦ మస్తజనులకున్. 375

ఆ. అన్న మిడిన మణిమ ♦ యావాసశయ్యాస
నములు నమృత భోజ ♦ నంబు హృద్య
మాల్యలేపనములు ♦ మహనీయమహిళాను
భవముఁ జిరత నొందు ♦ దివమునందు. 376

---

1. సుదరం. బలరంగా. 2. నన్నభక్తి.

—* నక్షత్రదానమహిమాతిశయనిరూపణము. *—

వ. అనిన విని యుధిష్ఠిరుండు నక్షత్ర విషయంబు లైనదానం
బుల తెఱం గెఱింగింపవే యనుటయు నిట్లు దేవకీదేవి
యడుగ నన్నారీరత్నంబునకు నారదుండు సెప్పిన
వాక్యంబులయర్థంబు లుపన్యసించెద నాకర్ణింపుము. 377

సీ. [1]కార్తికం బాయస మబ్జ • గర్భునితార మా
షములు మాంసమ్ము నం • జంగఁ గలుగు
నన్నంబు శశితార • యందు గోవార్ద్రి న
దితితారఁ బులగంబు • దీవు గలయు
నట్టులు గురుతార • నధిప సువర్ణ మా
శ్లేషరూప్యము మఖఁ • జెల్లునువ్వు
తిలలు భగుం డధి • దేవత యగుతారఁ
జెఱకుఁ దేనియ నుపా • సిక్తమైన

తే. భక్త ముత్తరఫల్గునిఁ • బాలతోడ
షాష్టికాన్నంబు రవితార • నకరిరథము
చిత్తనాఁడు శ్రీగంధపుఁ • జెక్క స్వాతిఁ
దనకుఁ బ్రియ మైనయది మేలు • దానమునకు. 378

సీ. అనఘ విశాఖ నె • ద్దనురాధఁ బైచీర
విను జ్యేష్ఠ దగఁ గఱి • వేముగూర్చి
ముల్లంగి మూల స • న్మూలఫలంబుఁ బూ
ర్వాషాఢఁ బెరుగు వృత్త • రాఖ్య మైన
యాషాఢ మాక్షికా • ద్రాన్నంబు హరివసు
జలతారకమలఁ గం • బళము గుజ్జు

---

1. కర్త్య.

లమరినబండియు ♦ [1]యవలుఁ బూర్వోత్తరా
[2]భాద్రపౌష్ణాశ్వినీ ♦ భరణులందుఁ
తే. [3]గ్రొవ్వు గలమేఁకనంజుడు ♦ గోటియమెఱచి
గంచుకుండతో మొదవళ్వ ♦ కలితశకట
మతులతిలధేను లీఁ బాడి ♦ యఖిలతార
కముల నీగులు నూర్ధ్వలో ♦ కములఁ జేయు. 379
వ. అని యెఱింగించి యమ్మానవపతితో నమ్మానసీయుం డిట్లనియె. 380
క. అలఘుతర సకలకామ్యం
బుల నిచ్చినయట్టిమహిత ♦ పుణ్యం బై తా
వెలుఁగుఁ గనక మిచ్చుట యని
పలికెం గర్జుఁ డత్రి ♦ పరహితచరితా. 381
తే. కనక మాయుఃప్రదంబు పా ♦ వనము భావ
శుద్ధి నొనరించు దాతకు ♦ సువ్రతమున
వేడ్కతో దాని నిచ్చుట ♦ వేఱ పొగడ
నేలయనియె హరిశ్చంద్రుఁ ♦ డిద్ధతేజ. 382
క. పానీయదాన ముత్తమ
దానం బని యఖిలధర్మ ♦ తత్త్వదృఢపరి
జ్ఞానానూనుం డగుమను
మానవపతి సెప్పె నృపస ♦ మాజవరేణ్యా. 383
క. కావునఁ జెఱువులు నూతులు
బావుఁలు గోలఁకులును నెప్పుడుఁ ♦ బౌరవవర్యా

1. నగలుఁ. 2. భాద్రలఁ బౌష్ణాశ్విభరణు. 3. గోఱిలు రాజ మాషంబులు గోటియ.

కావింప వలయు నవి గడుఁ
బావనములు పుణ్యలోక ♦ భాగితనిచ్చున్. 384

క. అనఘా యెవ్వనికావిం
చినసలిలాశయమునందుఁ ♦ జెలఁగుచు గోవుల్
గొను నీ రాతనివంశం
బున కవి గావించు నూర్ధ్వ ♦ భువనప్రాప్తిన్. 385

తే. ఆఁక లేక యెవ్వానిజ ♦ లాశయమున
మండు వేసవియందును ♦ మనుజకోటి
యవభృథస్నాన పానంబు ♦ లాచరించు
నతఁడు వొందఁడు విషమదు ♦ ర్గాభిగతులు. 386

క. యోగాది కర్మముల కుప
యోగింపంబడుటఁ జేసి ♦ యుత్తమము ఘృతం
బాగురువస్తువు నిచ్చుట
యాగములకు నగ్నికిం బ్రి ♦ యంబై యుండున్. 387

తే. గరగ లోనఁగిననరుఁడు భూ ♦ సురు లొనర్చు
నాచమనముఖకర్మంబు ♦ లందు షష్ఠ
భాగఫల మొందు నెగడికిఁ ♦ బాచనమున
కింధనము లిచ్చి ధనముల ♦ నెసక మెసఁగు.

ఆ. ఛత్త్రమిచ్చి కాంచుఁ ♦ బుత్త్రులఁ బురుషుండు
సకల కామ్యదాన ♦ సమము శకట
మిచ్చు టనఘ చెప్ప ♦ లిచ్చినఁ గంటకు
లైన రిపులఁ ద్రొక్కి ♦ యతఁడు దిరుగు.

క. తిలల పితృభోజ్యములుగా
జలజభవుఁడు సేసెఁ బితృని ♦ చయ మలరఁ గడుం

దిల లిచ్చిన శుచు లగుదురు
తొలఁగుం బర్వసురతాది ♦ దోషము లెల్లన్.
తే. దివ్యమునియగు కాశ్యపు ♦ భవ్యగాత్ర
ముల జనించి భవ్యంబులై ♦ తిలలు వెలయు
నట్లు గావునఁ దత్కృత ♦ యజన మఖిల
వస్తు యజనంబుతో సరి ♦ వచ్చునంద్రు. 391
క. తిలదాన మఖిలదానం
బులకంటె విశిష్ట మెల్ల ♦ మునులును నియతిం
దిల లర్ఘ్యము లగుపాత్రం
బుల కిచ్చియ కాదె పెంపు ♦ బొందిరి వత్సా. 392
వ. అని చెప్పి యాపగాతనయుం డొకవిశేషంబు వినిపింపవ
లసి ధర్మజున కిట్లనియె.
ఉ. దానము లాదిగాఁ గలుగు♦ధర్మము లెల్లను జేతకుఁ గానిజా
ధీనపుఁ జోటుగావలయు♦దేవతలుఁ మునులుంజతుర్ముఖుం
గానఁగఁబోయి యజ్ఞముఖ ♦ కర్మ సమాచరణార్థమై తదీ
యానుమతిందగం బడసి♦యయ్యయిచోటులనాచరింపరే.
క. కాననము గిరులు నదులును
నానాతీర్థములు భూజ ♦ నంబుల కెల్లఁ
భూనుత సాధారణములు
వానను ధర్మములు సేయ ♦ వచ్చు నిజేచ్ఛన్. 395
ఆ. అధిప నామనమున ♦ యందుఁ దోఁచినయది
యాచరింపవలయు ♦ నర్థ మగుటఁ
జేసి దీని నీకుఁ ♦ జెప్పితి గోదాన
శస్తమహిమ వినుము ♦ విస్తరింతు.

సీ. గోవు లెక్కుడు తపో ♦ భావితాత్ముల కంటె
నని నీ దద్గౌరవం ♦ బునకు మేర
గలదె సత్యాఖ్యలో ♦ కంబున నవి సోమ
సంగతత్వంబున ♦ సంచరించు
వినుత హోమముల కె ♦ ల్లను బాలు బెరువునే
యును నిచ్చుఁ గర్షనం ♦ బునకు నొదవుఁ
దోలు శృగంబులు ♦ వాలంబు రోమచ
యము శకృన్మూత్రము ♦ లఖిలవర్త
ఆ. నముల కుపచరించు ♦ శ్రమము శీతాతప
వ్యథయు లేమి నెపుడు ♦ నతిభరంపుఁ
బనులు సేయు గోవు ♦ బ్రాహ్మణుఁ డన నేక
తత్త్వమగుటఁ బరప ♦ దంబుఁ గాంచు.
క. గోవుల విప్రుల కిచ్చిన
నేవిషమపు గతులఁ బొరయ ♦ కేరికి నరుగం
గా వశము గానిలోకము
లావాసంబులుగ నిలుతు ♦ రతిసుఖవృత్తిన్.
క. గోవులపా లమృతం బని
దేవేంద్రుఁడు సెప్పెఁగాన ♦ ధీరత్వనిధీ
గోవు నొసఁగ నమృతము స
ద్భావంబున నిచ్చినట్టి ♦ ఫల మొడఁగూడున్. 399
తే. అనఘ గోవులు ప్రాణంబు ♦ లని సమస్త
మునులు సెప్పుదు రట్లుగా ♦ వునఁ దలంపఁ
బ్రాణదానవిధాన సం ♦ ప్రాప్త మైన
ఫలము గోదానకర్తకుఁ ♦ గలుగుఁ జూవె. 400

క. క్రూరునకు నాస్తికునకు దు
రారంభునకు కిచ్చినం బ ♦ రమదుఃఖమునుం
గూరును గోవది దాతను
నారకిఁ జేయుం బరీక్ష ♦ ణము గడు వలయున్. 401

అ. గొడ్డు బడుగుఁ దెవులు ♦ గొంటుఁ గ్రేగే పెడలిన
దాని నెచ్చ లేని ♦ నూనమైన
యట్టిదాని నొకట ♦ నాయాసపడి యున్న
దాని నీరు గోప్ర ♦ దానవిదులు. 402

క. విను పుణ్యలోకముల కా
వనఘా విప్రులకు గోచ ♦ యంబులఁ బె క్కి-
చ్చిన నవి దాతకు మోక్షం
బును జేయఁగఁ జాలునంద్రు ♦ పూర్వాచార్యుల్. 403

వ. అని చెప్పి గాంగేయుం డన్నపానీయదాన ఫలాతిశయం
బులు వెండియు వినిపింప వేడ్కసేసి యవ్విభున కిట్లనియె.

సీ. అధిప యింకను విను ♦ మన్నంబు జలమును
నిచ్చుట యీవుల ♦ కెల్ల నెక్కు-
డగుట నేఁ జెప్పెద ♦ నమృత సుధాస్వధా
నామముల్ సురలందు ♦ నాగకులము
నందునుబితృకోటి ♦ యందును వర్తిల్లు
నన్నంబునకు నోలి ♦ నట్లుఁ గాక
యది ప్రాణ మంద్రదు మ ♦ హాత్ములు గావున
దానిఁ బెట్టుట ప్రాణ ♦ దానసమము

తే. విను విశేషించి తత్పాక ♦ మునకు జలము
పాశ్రయము చంద్రునకుఁ బుట్టఁ ♦ బట్టు నయ్యో

జలము చంద్రుఁడు గాఁడె యో ♦ మధులఁ బ్రోచుఁ
గాన యుత్తమ మన్నంబు ♦ కంటెజలము.

వ. అని పలికి మఱియును. 406

క. తనకుఁ గలయట్టియన్నము
నన సురపితృపూజనములు ♦ నరునకు నడపం
జను నతిథి తర్పణము దా
నన తగ నొనరించువాఁడు ♦ నరవర ముఖ్యా 407

వ. అని నిర్దేశించి తిలదానం బత్యాదరణీయం బని ప్రసంగిం
చి యది వినినది యైనను నేమి తద్విషయంబున కొ
క్క యితిహాసంబు గలదు చెప్పెదవిను మని పలికి యని
మిషనదీనందనుండు కుంతీనందనాగ్రజుతో ని ట్లనియె

—♦ తిలదానవిషయక యమబ్రాహ్మణసంవాదము. ♦—

సీ. మధ్యదేశమునఁ గా ♦ మంబు విద్వజ్జన
బహుళ మై యొక్కటి ♦ పర్ణశాల
యనుపేర నొప్పారు ♦ నందుల విప్రుని
శర్మినామునిఁ బ్రీతి ♦ జముఁడు పిలువఁ
బనిచి దానముల కె ♦ ల్లను దిలదాన మె
క్కుడు తిలలకుఁ బిత్రు ♦ కోటి వేడ్క
సేయుఁ బాపంబులు ♦ సెందవు తిలభక్షిఁ
బుణ్యకీర్తుత్వంబు ♦ బుద్ధిఁ గోరు

తే. దేనిఁ దిల లెప్డు విప్రుల ♦ కిమ్ము భక్తి
ననియె వస్త్రప్రదీపము లీగి ♦ యతులదాన
మనఘ చీరల దివియల ♦ నమరపితృస
మర్చనము సేత పరమధ ♦ ర్మ మని చెప్పె. 409

వ. అని యిట్లు యమబ్రాహ్మణ సంవాదంబు వినిపించి శాం
తనవుం డమ్మహీకాంతు నాననంబు సవిశేషాదరంబున
నాలోకించి. 410

క. విను పృథివియును సరస్వతి
యును గోవును దానవిధికి ♦ నొక్కంతలుగా
విని యుండుదు వీనిం బో
లినదాతవ్యములు నొండు ♦ లేవని విందున్. 411

ఆ. రాజముఖ్య తగుస ♦ రస్వతి శిష్యున
కొసఁగ భూమిదాన ♦ మూర్జితముగఁ
జేసినట్టిఫలము ♦ సిద్ధించు ధేనువు
నిచ్చుటయును భూమి ♦ నిచ్చినట్లు. 412.

క. అనయముఁ గొంచెపు వెలకుం
గొనవచ్చును సారభూత ♦ గోవును దానం
బున ఫల మధికము దానము
గొనినాతఁడు సుఖము దానఁ ♦ గొనుఁ జేసేతన్. 413

ఆ. దేవపితృసమర్చ ♦ నావాసములు గోశ
కృత్ప్రలేపనమునఁ ♦ గీర్తనీయ
శుచితఁ బడయు ననిన ♦ సువ్రత గోవుల
భూరిమహిమ వేఱ ♦ పొగడ నేల. 414

తే. కుడుపునకు ముంద రొడ్డుల ♦ గోవునకు స
మంచితగ్రాసముష్టి ని ♦ త్యంబు నేఁడు
గాల మిచ్చిన నతఁ డెల్ల ♦ కామ్యములును
బ్రాహ్మణుల కర్థి నొసఁగిన ♦ ఫలము వడయు. 415

క. గోదానవిధము సుపథగ
మై దాతకు నెల్ల మేలు ♦ నాపాదించున్
వేదప్రియ యది దురితో
త్పాదక మగు నాతనికి వి ♦ పథగత మైనన్. 416

—♦ నృగచరిత్రము. ♦—

తే. దుష్ట మైనగోదానంబు ♦ గష్టవృత్తిఁ
దెచ్చె నృగనాముఁ డగుజగ ♦ తీవిభునకు
నర్తెఱం గితిహాస మై ♦ యవనిఁ బరఁగు
వినుము సెప్పెద దాని వి ♦ వేకధుర్య. 417

క. ద్వారవతి నొక్క నూతం
దోరపుఁదను వక్కజ మగు ♦ తొండ నొకటి న
చ్చేరువ మెలఁగుజనులు గని
నీ రిది గలఁగించు నిట్లు ♦ నిలిచెనయేనిన్. 418

క. అని బలుమోకులు వేగమ
కొని వచ్చి తగిల్చి లావు ♦ గొని తిగువఁగ నా
ఘనజంతు వచలితం బై
యునికికి విస్మయము నొందు ♦ నుల్లంబులతోన్. 419

తే కృష్ణుపాలికిఁ బోయి య ♦ క్కీటమున్న
తెఱగు సెప్పినఁ జని దానిఁ ♦ దిగిచె వెడల
నమ్మహాత్ముఁ డెఱింగియు ♦ నరిథితోడ
నడుగ నది యేను నృగుఁడఁ జ ♦ మ్మనియె ననఘ. 420

వ. అనిన విని యద్దేవుండు నీ వనేక గోసహస్రంబుల విప్ర
జనంబుల కిచ్చి తని విందు మిట్టిదుర్జన్మంబు నీ కేల వాటి
ల్లె ననుటయు నమ్మనుజవల్లభుండు. 421

సీ. ఉత్తమబ్రాహ్మణుం ♦ డొకనికి నొక్కనాఁ
డొకగోవు నిచ్చితి ♦ నుల్ల మరల
నతఁడును గొనిపోయె ♦ నది మేఁత కర్థిమా
కదుపులలోపలఁ ♦ గలసి వచ్చె
గోవుల మఱియును ♦ గోపాలకులు దాన
విధికినై తెచ్చుచో ♦ విధివశమున
వానిలో నదియును ♦ వచ్చిన నెఱుఁగక
దానంబు సేసితి ♦ దాని మున్న

ఆ. గొనిన యతఁడు దడవి ♦ కని యిది నాదుగో
వనియెఁ బిదపఁ గొనిన ♦ యతఁడు పెనఁగి
నాకు నృపతి యొసఁగె ♦ నా నిద్దఱకును వా
దైన నన్నుఁ గాన ♦ నరుగుదెంచి. 422

వ. తమముందటి తెఱం గెఱింగించి. 423

క. ఇచ్చినవారల కొనఁగా
వచ్చిన నడ్డంబు గలదె ♦ వసుధాధిప యం
చిచ్చఁ గడు నొచ్చి పలికిరి
వెచ్చనినిట్టూర్పు లడర ♦ విప్రు లిరువురున్. 424

వ. మఱియుం బాడముమాటలు నమ్మొదవుపోకడ నాకుఁ
దెల్లం బగుటయు. 425

ఉ. దానికి నేనుజిత్తమునఁ♦దాపమునొందుచుమున్ను గొన్నయ
మ్మానితవిప్రు వేఁడికొని ♦ మంచివిగోవులు నీకునూఱు వే
యైననునిచ్చెదఁ దా విడువ ♦ వయ్య మహీసురవర్య నెమ్మన
ద్ధేనువునన్ను నాస్యమున♦దీనతదోఁపఁగ నాతఁ డిట్లనున్. 426

తే. పాలుగడుఁ బెక్కుదాని[1]న • బాము లెస్స
పెయ్య కర్మిలి గలదు మ • త్ప్రియసుతుండు
పాల కేడ్చినయపుడ చ • న్నట్ట నిచ్చు
నేది ప్రొద్దైన నట్టిగో • వెందుఁ గలదు. 427

క. శ్రీవ్రాలె నింటిలో నా
గో వుండఁగఁ జూచు గాని • కోటి మొదవులుం
గావు సరి దాని కని భూ
దేవుఁడు వ్రావుటయు నేను • దీనత దోఁపన్. 428

చ. కనకముధేనువుల్ మణిని • కాయములిచ్చెద నేమియైనఁ ద
క్కునుమది కిష్టమైనయది • గోరుము గోవునకంచుఁ జేరిత
క్కినధరణీసుపర్వునకుఁ • గీడ్పడియెమ్మెయి వేఁడికొన్న నేఁ
గానభవదీయరాజ్యమును• గుత్సితవృత్తికినియ్యకొందు నే.

తే. అనియెఁ గాని నామాట గై • కొనఁడ యాతఁ
డట్టియెడఁ గాలవశగతి • యావహిల్లి
యమునికడ కేఁగ నాతోడ • నతఁడు వికచ
నలినలోచన యిట్లని • పలికెఁ బ్రీతి. 430

చ. జనవర పుణ్యకర్మము ల•సంఖ్యము లీవొనరించితొక్క వి
ప్రునిధన మజ్ఞతంగొనుటఁ • బొందెసకిల్బిషభావమల్పమి
ట్లొనరిన రెంటనయ్యెడుమ•హోన్నతిదుర్గతులందుమున్ననీ
చనునెడయెద్దినావుడు[2]న•సౌఖ్యపుఁజోటనిసమ్మతించితిన్.

ఆ. అట్టులియ్యకొనిన • యాక్షణమాత్ర మ
స్తకము క్రిందుగాఁగ • ధరణిఁ బడఁగ

1. నభాము. 2. ననహ్యాపుఁజోటను.

వలసె నవుడు పింటి ♦ నలఘుకృపార్ద్రి వ
ర్ణాలికలిత మైన ♦ యముని పలుకు. 432

వ. అది యెయ్యది యంటేని. 433

తే. వాసుదేవుఁ డనేకసం ♦ వత్సరముల
కధిప నీయున్నచోటికి ♦ నరుగుదెంచి
యుద్ధరించు ని న్నట నిత్య ♦ సిద్ధసౌఖ్య
మైనలోకమునకుఁ జను ♦ దనఘ నీవు. 434

వ. ఇట్లు వినుచు నిలాతలంబునం బడి కృకలాసత్వంబు నొం ది చరియించుచుండి నేఁడు దైవదత్తం బయినచిత్తవర్త నంబు జేసి యిక్ష్వాకుపంబునకు వచ్చిన యపరక్షణంబునం గృకలాసంబులకు లేనిమేని పెంపావహిల్లిన నుల్లంబు సవి స్మయం బగుచు నుండ యమప్రసాదంబున నెప్పుడును మాయనిపరిజ్ఞానంబు వర్తిల్ల నున్నంతం బరమయోగీం ద్ర భావ్యం బగునీభవ్యసన్నిధి దొరకొనియె నని పలికె నప్పు డప్పుడమిఱేనికిఁ బూర్వాచరిత పుణ్యకర్మానురూ పం బగురూపం బావిర్భవించిన దానికిం బ్రమోదభరి తుండై యతండు. 435

నృగుఁడు శ్రీకృష్ణువలనఁ బాపవిముక్తుఁడై పుణ్యలోకమునకుఁ బోవుట.

తే. దేవ నీ దగుకాౕర్ణ్య ♦ దృష్టి యమృత
పూరమునుబోలె నామీఁద ♦ బొలయుటయును
దీనదశ వాసె భవదను ♦ జ్ఞానిరూఢి
నేను జనియెద నంచిత ♦ స్థానమునకు. 436

క. అని సవినయ ప్రణామం
బున నారాధించి వృష్ణి ♦ పుంగవుఁ డగ వీ

డొక్కని యానృగుఁడు విమానం
బున నుత్తమలోకమునకుఁ • బోయె నరేంద్రా. 437

వ. ఇవ్విధంబున. 438

క. భరితానందుఁ డగుచు నృగుఁ,
డరిగిన లోకహితకారి • యైకృష్ణుఁడు ని
ర్భరమధురతాతిహృద్యా,
క్షరంబు గా నిట్టు లనియెఁ • గౌరవముఖ్యా. 439

క. ధరణీసురధనహరణము,
దురితతమము నృపున కధిక • దోషము నృగగో
హరణముక్రియ విప్రస్వా,
హరణము భూపాలవరున • కాపదఁ దెచ్చున్. 440

వ. అనియె నివ్వాక్యంబులు నీకుం జెప్ప వలవ దైన[1]నితిహా
సావసానవర్తి యగుటం జేసి వినిపించితి నని చెప్పి య
ప్పాండవాగ్రజుతో భీష్ముండు వెండియు. 441

క. సత్సంగతి సజ్జనులకు,
నుత్సవ మొనరించు నృగున • కున్నతిఁ ద్రిజగ
ద్వత్సలుఁ డగుకృష్ణుండు స,
ముత్సుకతం జేరఁ జనుట • యొసఁగినమాడ్కిన్. 442

వ. అనిపలికి మఱియును. 443

క. దానము సమగ్రఫలదము,
భూనాయక గోవునెడ వి • బుధత్వము గీ
డైనది గావున గోస,
మ్మానసన మేమఱక యుండు • మది నేప్రొద్దున్. 444

---

1. నితిహాసానువర్తి.

వ. అనిన విని ధర్మజుండు గోవులయెడ విరుద్ధాచరణంబున నయ్యెడుదురితంబు తెఱంగెఱింగించితి గోదానఫలవిశేషం బింకను విన వలతుం జెప్పవే యనుటయు ననిమిషనదీ నందనుం డివ్విషయంబున నైనది యొక్క యితిహాసంబు గల దాకర్ణింపు మని యతని కిట్లనియె. 445

—* గోప్రభావవిషయకం బగునాద్దాలకిపుత్త్రిచరిత్రము. *—

సీ. [1]అనఘుఁ డౌద్దాలకి ♦ యనుమహాముని దన,
తనయునిఁ బిలిచి యి ♦ ధ్మములు దర్భ
కట్టయు జలపూర్ణ ♦ కలశంబుఁ బువ్వుల,
మఱచి వచ్చితి [2]నేటి ♦ మడుఁ గుమార
కొనిరమ్ము వేగంబ ♦ చని యన్న నాచికే,
తాహ్వయుం డగునతం ♦ డరుగునంత
వాహిని పొంగిన ♦ వట్టోడి యవి పోయెఁ,
గానక యాతండు ♦ గ్రమ్మఱంగ

ఆ. నరుగుదెంచి కాన ♦ ననుటయు నాఁకలి
దనదుకర్మవైకృ ♦ తంబు సైఁపఁ
జాల కలిగి యోరి ♦ జముఁ జూడఁ బొమ్మని,
శాప మిచ్చెదండ్రి ♦ భూపవర్య.

వ. ఇట్లు శపించిన నబ్బాలకుండు గేలు మోడ్చి ఫాలంబున మోపికొనుచుం బ్రసన్నుండ వగు మని పలుకు పలుకఁ గాఁ జేతనారహితుండై పడుటయు నమ్మునివరుండు. 447

క. కనుఁగొని పశ్చాత్తాపం,
బున నుల్లం బెరియ నిట్లు ♦ పుత్త్రకు నే నే

1. శ్వేతకేతుం డనువిశ్రుతముని. 2. నేటిమడుఁగునొరఁ

పనికై చేసితి విగతా
సునిఁ గా నని మూర్ఛ మునుఁగు • చుం బడియె ధరన్.

వ. పడి యొక్కింతసేపునకుం దేఱి[1]తనయుం దేఱిచూచి య
గ్రపు లోలుకనబ్బాలకునురంబున మొగంబు మోపి చేష్ట
దక్కియుండె నద్దివసేషంబును నయ్యామినియునుం జనియె
సూర్యోదయసమయంబున. 449

ఆ. అతనికన్నుసీర • నాప్లుతం బైనయా
శవము చేతనించి • చలన మొంది
యెలమి నత్తపస్వి • యీక్షించు చుండఁ గ
న్దెఱచె నిట్లు మగుడఁ • దెలివి నొంది.

క. తనుఁ గనుఁగొనియెడిసుతుతో
మునిపతి యిట్లనియెఁ బుణ్య • ములపొందవు నీ
వనఘ చని పుణ్యలోకముఁ
గని మత్పుణ్యమున రాక • గలిగెను మగుడన్. 451

క. నీదగుతనువునదివ్యా
మోదము సాంద్ర మయి సోఁడు • ముట్టెడు నత్యా
హ్లాదమహైశ్వర్యసము
త్పాది యగుచు నీగతాగ • తములం జెపుమా. 441

వ. అనిన విని యమ్మునిపతికిం బ్రణమిల్లి యక్కుమారుం
డి ట్లనియె. 452

సీ. నీయాజ్ఞఁ జని కమ • నీయపిశాల మై
మణిమయత్వంబున • మహిత మగుచు

---

1. తనయుదెసం జూచి.

వ. అనిన విని ధర్మజుండు గోవులయెడ విరుద్ధాచరణంబున నయ్యెడుదురితంబు తెఱంగెఱింగించితి గోదానఫలవిశేషం బింకను విన వలతుం జెప్పవే యనుటయు ననిమిషనదీ నందనుం డివ్విషయంబున నైనది యొక్క యితిహాసంబు గల దాకర్ణింపు మని యతని కిట్లనియె. 445

—* గోప్రభావవిషయకం బగునౌద్దాలకిపుత్త్రిచరిత్రము. *—

సీ. [1]అనఘుఁ డౌద్దాలకి ♦ యనుమహాముని దన,
తనయునిఁ బిలిచి యి ♦ ధ్మములు దర్భ
కట్టయు జలపూర్ణ ♦ కలశంబుఁ బువ్వుల,
మఱచి వచ్చితి [2]నేటి ♦ మడఁ గుమార
కొనిరమ్ము వేగంబ ♦ చని యన్న నాచికే,
తాహ్వయుం డగునతం ♦ డరుగునంత
వాహిని పొంగిన ♦ వట్టోడి యవి పోయెఁ,
గానక యాతండు ♦ గ్రమ్మఱంగ

ఆ. నరుగుదెంచి కాన ♦ ననుటయు నాఁకలి
దనదుకర్మవైక్ల్య ♦ తంబు సైఁపఁ
జాల కలిగి యోరి ♦ జముఁ జూడఁ బొమ్మని,
శాప మిచ్చెదండ్రి ♦ భూపవర్య.

వ. ఇట్లు శపించిన నబ్బాలకుండు గేలు మోడ్చి పాలంబున మోపికొనుచుం బ్రసన్నుండ వగు మని పలుకు వలుకఁ గాఁ జేతనారహితుండై పడుటయు నమ్మునివరుండు. 447

క. కనుఁగొని పశ్చాత్తాపం,
బున నుల్లం బెరియ నిట్లు ♦ పుత్త్రకు నే నే

1. శ్వేతకేతుం డనువిశ్రుతముని. 2. నేటిమడుఁగునొరఁ

పనికై చేసితి విగతా
సునిఁ గా నని మూర్ఛ మునుఁగు • చుం బడియె ధరన్.

వ. పడి యొక్కింతసేపునకుం దేఱి[1] తనయుం దేఱిచూచి య
గ్రపు లోలుకనబ్బాలకునురంబున మొగంబు మోపి చేష్ట
దక్కియుండె నద్దివ శేషంబును నయ్యామినియునుం జనియె
సూర్యోదయసమయంబున. 449

ఆ. అతనికన్నుసీర • నాప్లుతం బైనయా
శవము చేతనించి • చలన మొంది
యెలమి నత్తపస్వి • యీక్షించు చుండఁ గ
న్దెఱచె నిట్లు మగుడఁ • దెలివి నొంది.

క. తనుఁ గనుఁగొని యెడిసుతుతో
మునిపతి యిట్లనియెఁ బుణ్య • ములపో[?]క వ్రు నీ
వనఘ చని పుణ్యలోకముఁ
గని మత్పుణ్యమున రాక • గలిగెను మగుడన్. 451

క. నీదగుతనువునదివ్యా
మోదము సాంద్ర మయి సోడు • ముట్టెడు నత్యా
హ్లాదమహైశ్వర్యసము
త్పాది యగుచు నీగతాగ • తములం జెపుమా. 441

వ. అనిన విని యమ్మునిపతికిం బ్రణమిల్లి యక్కుమారుం
డి ట్లనియె. 452

సీ. నీయాజ్ఞఁ జని కమ • నీయవిశాల మై
మణిమయత్వంబున • మహిత మగుచు

1. తనయుదెసం జూచి.

వెలిఁగెడుసమవర్తి ♦ కొలువుకూటముఁ బ్రవే
శించితి నాతఁడు ♦ సేరఁ బిలిచి
యంచితాసనము వె ♦ ట్టించి భవద్వార
వాతిశయంబున ♦ నర్ఘ్యముఖ్య
పరిపూజనముల సం ♦ భావించె నతనితో
నేలోకమునఁ వసి ♦ యించువాఁడ

తే. ననఘ యానతి యిమ్ము నా ♦ కంటినన్న
నీవు పావవు నీతండ్రి ♦ నిన్ను జమునిఁ
జూడఁ బొమ్మని పనిచినఁ ♦ జూచి తండ
యరుగు మమ్మనివగ పేద ♦ ననియె నతఁడు.

వ. అనుటయు నట్లు గాక మగిడి పోయెద నీకడకు వచ్చితి ధర్మమయుండ వగునిన్ను దర్శించితిం బుణ్యలోకంబులు దర్శింప వేడ్క పుట్టెడుఁ జూపవేయని విన్నవించిన.

ఉ. అంచిత వాహనాకలిత♦యానముఁ దేరఁగఁబంచినన్ను నె
క్కించి సహోధిరూఢుఁడయి♦కేల్ దన కేల నమర్చి సత్కథా
సంచయ వర్తనుం డగుచుఁ♦జారుముఖాబ్జవికాసమొప్పవ
ర్తించుచుఁ బుణ్యలోకములు♦ప్రీతియెలర్పఁగ నాకుఁజూపినన్

తే. నయనములకుఁ జిత్రమున గా ♦ నందమొసఁగు
నట్టిమణి గేహవాపికో ♦ ద్యానములును
బరమభక్ష్యభోజ్యాత్మక ♦ గిరులు హృద్య
దుగ్ధఘృతమయఘనసరి ♦ త్తులును గంటి. 457

వ. మఱియు గంధమాల్యదివ్యాంబరాభరణ ప్రముఖంబులగు భోగయోగ్య పదార్థంబులు మహారాసులై యుండ నాలోకించితి నీలోకంబు లేపుణ్యంబు సేసిన జనులకను

భావ్యంబు లని యడిగితి నడిగిన ధర్మరా జిట్టిట్టివారి వని యెఱింగించి యుందధికవిభవంబు లైనయట్టి మానసీయ స్థానంబులు గోదానంబు లాచరించినవారల యవి భక్ష్య భోజ్యగిరులును దుగ్ధఘృతనదులును వారివ యని చెప్పి వెండియు. 458

క. మానితపా[ ]ము సదను
స్థానంబును బ్రీతి భ క్తి • సంపన్నతలుక
ధేనువు మేలిమియుం గల
దానముఫల మిట్టి దనఁగఁ • దరమె యజునకున్. 459

తె. బలము లేఁ బ్రాయమును రూపుఁ • గలుగునట్టి
గనపయెద్దు సద్ధర్మ వి • ప్రునకు నిచ్చి
నతఁడు సద్విధి గోదాన • మాచరించి
నతనిపడసినగతిఁ గాంచు • ననఘచరిత. 460

క. గోవులు సూర్యునియుజ్జ్వల
గోవులయ టగుటఁ జేసి • గోదానపరుల్
భూవినుతా సూర్యసదృశు
లై వెలుగుఁదు రిట్ల చెప్ప • నాగమఫణితుల్. 461

క. అని పలికి వీడుకొలిపిన
మునివర యజ్ఞమునిచరణ • ముల కెఱఁగి ముదం
బున వచ్చితి ననె జనకుని
మన మానందరసపూర • మయతం బొంగక. 462

—*ఇంద్రునకు బ్రహ్మ సెప్పిన గోదాన విషయక వాక్యములు*—

వ. అని చెప్పిన విని కుంతీ తనయాగ్రజుండు గోదానకర్త లెందేని పసింతు రాలోకం బెట్టి దెఱింగింపు మనిన న

న్నం దేవునితో దేవవ్రతుండు దీనికి బ్రహ్మవాక్యంబులు
గల విట్ల యింద్రుండడిగిన నతనికి బ్రహ్మ యిట్లనియె. 463

ఆ. అడిగి మేలు సేసి ♦ తాలోక మెవ్వారు
నెఱుఁగ కునికి దెల్ల ♦ మేను సువ్ర
తాత్ము లైన మునులు ♦ నతుల పాతివ్రత్య
సతులు నెఱుఁగుదుము వి ♦ శాలచిత్త. 464

క. వినుమయ్యెడఁ గాలక్రమ
మును దప్పియు రోగములును ♦ ముదిమియు లే వ
వ్వినుతస్థానం బవ్వాయు
మును గేవలసారసంప్ర ♦ మోదకరంబున్. 465

వ. దాని పేరు గోలోకంబు. 466

క. గురుశుశ్రూషకులును స
త్యరతులు శమదమవినిర్మ ♦ లాత్ములు దుర్భ
క్ష్యరహితులును నిల్తురను
త్తరమగు నచ్చోట గోప్ర ♦ దానపరులతోన్. 467

వ. అని వెండియు. 468

ఉ. దాయధనంబు సంగరవి ♦ ధానముపార్జితముగా సధర్మకో
పాయసమాహితంబును శుభ ప్రతిపాదనలబ్ధముగా మరు
న్నాయక వెండియుంగలుగు♦నాయపుఁజొప్పులసొమ్ములుందగుగా
గోయజనార్థసత్క్రియల♦కుం బెఱసొమ్ములనైనఁగీడగున్. 469

క. విను గోలోకంబును గడ
చినలోకము గలుగ దూఁది ♦ చెప్పెదఁ బుణ్యం
బును గోప్రదానవిధి మిగి
లినయట్టిది వత్స యొండు ♦ లే దరయంగన్. 470

తే. ఆగమాధ్యయనంబు ప్రీ • తాభిరతియు
నైజకర్మశీలము గురు • పూజనంబు
మాతృపితృరక్షణముఁ బాత్ర • మహిమ లప్ర
తర్క్యఫలదాయి యైన గో • దానవిధికి. 474

క. అని నిర్దేశించిన న
వ్వనరుహాసంభవునిదివ్య • వాక్యంబులు నె
మ్మనమున నిడి గోయజ్ఞము
లనూనవిధి నడపె నింద్రుఁ • డమలచరిత్రా. 472

క. నీవును నవధానముతో
గోవుల మన్నింపు పాత్ర • కోటి కొసఁగు న
త్సేవితపుణ్య చరిత్రము
లావెరవునఁ బోల వెన్ని • యైనగుమారా. 473

క. అని యిట్లు గోవిశేషము
లనేకభంగులనుబాండ • వాగ్రజునకు శం
తనసుతుఁడు సెప్పె నని విని
మునివర యేభంగి వాక్య • ములు మఱి చెల్లెన్. 474

వ. అని యడుగుటయు. 475

శా. ధర్మాధర్మ[1]విదూరనీతిపరవి • ద్వచ్చిత్తయోగీ జగ
న్నిర్మాణస్థితి తంత్రసంహరణ ధూ • ర్నిర్వాహ రాగీ మహా
శర్మాపాదనపాదపద్మ సుతప • స్స్వాధ్యాయసద్మా మనో
ంతర్ముద్రాలతికాఫలత్వలసితా • దాతిస్ఫుటోద్భాసితా.

1. విధూతనీతి – విభూతినీతి.

క. ప్రమదివిషాదాదిద్వం
ద్వమలాపిహితాంతరంగ • వాసా విశ్వా
గమవేద్యసముల్లాసా
శమరమ్యవిభాస నియమ • జనితవికాసా. 477

మాలిని. అకలుషహృదయాంత • ర్వ్యాగసంసిద్ధిమూర్తీ
వికృతిదశకషట్క • స్వీకృతీప్రౌఢవర్తీ
సకృపలసద పాంగో • త్సార్యమాణాశ్రితార్తీ
సకలనిగమచూడా • చారురంగైకవర్తీ. 478

## గద్యము.

శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర
బుధారాధన విరాజి తిక్కన సోమయాజిప్రణీ
తంబైన శ్రీ మహాభారతంబున యాను
శాసనిక పర్వంబునందు
ద్వితీయాశ్వాసము. 479

శ్రీ శివాయ గురవేనమః.

# శ్రీ మదాంధ్ర మహాభారతము.

## ఆ ను శా స ని క ప ర్వ ము.

### ప్రథమాశ్వాసము.

(టిప్పణి)

జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిం ।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే॥

బంధువివాదవ్యాకుల చిత్తుఁడగు ధర్మజునకు తత్తదుచితోపాఖ్యానములతోఁ జిత్తశాంతిఁగూర్చి జారచోరాది పీడలు లేకుండ దేశము సుభిక్షముగ నుండుటకు ధర్మజుని రాజ్యస్వీకారమునకు కొడఁబఱచి తత్తదుచితములగు ధర్మకర్మ మార్గముల నుపదేశించుచున్నాఁడు. అందువలన దీనికి ననుశాసనికపర్వ మను నామము వచ్చినది.

2. దివ్యజ్ఞాన దేదీప్యమాన మానసుఁడు = ఉత్తమమయిన జ్ఞానముచేత ప్రకాశించు మనస్సు కలవాఁడు.

3. చలముకొని = పట్టుదలవట్టి.

4. ఒక్కఁతల = ఒకయెత్తు = ఒకకొలఁది = ఒకప్రమాణము, ఉత్తలము = వ్యాకులము.

5. శమాన్విత = శాంతస్వభావముకలది, కాలవశత్వముఁబొందుట = మరణించుట.

6. రజ్జున = త్రాట, కెఱగత్తి = పెద్దఖడ్గము, పొడపాపవుర్వు = త్రాచుపాము.

7. పిన్నాతని = పిన్న + అతని = చిన్నవానిని, ఉసురు = ప్రాణము.

11. పేదమాటలు = అర్థహీన వచనములు. కోపవివశుఁడైన నాకు = (కోపవివశుఁడనైన అని యుండవలెనని చిన్నయసూరి ఆశయము.)

12. అర్జునక నామము నీకవదాతభంగికిఁ జాలదే = అర్జున శబ్దమునకు తెలుపు అర్థము మంచినడవడి తెల్లనిదని ప్రతీతి. కనుక అర్జునకుఁడను పేరుగల నీవు మంచినడవడి కలవాఁడవు కావేని నీ నామము నేతిబీరకాయవలె నిరర్థకమని భావము.

13 ఊఱదె = ఒప్పదె, నేనెట్లును హింసకు నొడబడనని గౌతమి (వేట మొదలగువానిచే పాపము చేకూరదుగాన ఇట్లే) జనబాధకములైన జంతువులను జంపిన పాపంబు సమకూరదని (బోయవాఁడు పల్కినాడు) పల్కె బోయ పట్టిన రిపుఁ బోరిగొనంగనలదని చెప్పె నవ్వనిత. వాఁడు (బోయ) అహిఁ దెగఁజూచి జనంబుల గాచుటుఱదె వృత్రుఁ జంపడె దేవవిభుఁడు, యజ్ఞధ్వంసనము సేయఁడె ఫాలనయనుఁడు అట్లు కావె ధర్మువు హింసలు నీవు దీనికియ్యకొనుమని తెలిపె. అట్లెంత తెలిపినను దయావతియైన యత్నాతి (ఆగౌతమి) పాపమునకు జొరదయ్యె (పిదప) బోయనికి ఇట్లనియెఁ బాము (సర్పము)

14. నెఱి = క్రమము

16. కుమ్మరికోల = కుమ్మరివాని దండము, సారె = కుమ్మరవాని చక్రము కుమ్మరవాడు దండముతో ద్రిప్పుచుండ సారె తిరుగును కాని సారె స్వతంత్రముగా తిరుగ నేరదు అటులనే మృత్యువపరాధీననయి అవి ఆడించినట్లాడితిని కాని నాకీ కార్యమున స్వాతంత్ర్యము లేదని భావము.

19 మెలఁగ మిడుకనీక = మెలఁగనీక మిడుకనీక (సంచరించనీక బ్రదుకనీక) సర్పము కులాల దండమువలె జడము కాకుండుటచే నస్వతంత్రము కాదనియు నందువలన దండ్యమనియు భావము.

21. యజ్ఞకర్త ఋత్విజులచే హవిస్సు హోమము చేయించును. ఇచట ఋత్విజులు యజ్ఞసాధనములు. వీరు చేతను లయినను యజ్ఞఫలము కర్తకుఁ జెందునుగాని వీరికి జెందదు. అట్లే సర్పము శిశు మారణమున చేతన సాధనమయినను తత్ఫల భాజనము కాదని భావము.

26. సర్పః.

నిర్ద్దోషం దోషవంతంవా నత్వాంమృత్యో బ్రవీమ్యహం
త్వయాహం చోదిత ఇతి బ్రవీమ్యేతావదేవతు॥
యదికాలేపి దోషోస్తి యది తత్రాపి నేష్యతి।
దోషోనైవ పరీక్ష్యోమే నహ్యత్రాధికృతావయం॥
నిర్మోక్షస్తస్య దోషస్యమయా కార్యో యథాతథా।
మృత్యోరపి నదోషస్స్యాత్ ఇతిమేత్ర ప్రయోజనం॥
అను శ్లోకములలోని భావము.

అనిన భుజగమిట్టులను నీవలన నేను
గుణము సెప్ప దోషగణన సేయ
నన్ను బనిచెనంటి నామీద దోషంబు
బాపి కొనుట నాకుఁ బాడి కాదె॥
వినుమటు కాలుని దెన్నశె
నను దోషము కలిమిలేమి నాకాడంగాఁ
బనిరేమి దోషగతిచిం
తన భాషణములకు నేను తగుదునె యనఘా।

అను పద్యములచే ప్రతిపాదింపబడుటచే నీరెంటి నడుమ "అనిన మృత్యువు పామున కిట్లనియె నను వచనము ప్రక్షిప్తమే పైరెంటిలోని భావము సర్వము చెప్పుటయే ఉచితము గదా.

?8. అంటకు = అనుటకు

29. పాప సమావేశిత మతులరు = పాపావేశము గలమనస్సు కల వారు ("రు" అనునది గౌరవార్థమున విహితము ఇట నీగౌరవము అవహేలనమున పర్యవసన్నము.
ఒరగనాడు = తమదోషమును తప్పించుకొనునట్లు పలుకుట (ఎఱుగ నాడిన అని పాఠాంతరము)

36. ధరణీదేవాంగన — బ్రాహ్మణ స్త్రీ (గౌతమి)

40. అడలుగా = శోకమును.

43. దానికిందగు విధంబు = మృత్యుభయము వాపికొనజాలు విధము
అయ్యానువు = మృత్యుభయము వాపికొను నవకాశము.

44. సర్వజనకామందారకమై = సమస్తజన సమూహమునకు కల్పవృక్షను వంటి వాడు, సువీర్యమ పుత్రోభూత్సర్వ సంగ్రామ దుర్జయః సుదర్శయ ఇతిఖ్యాతః సర్వశాస్త్రభృతాం వరః దుర్జయస్యేంద్రవపుషః పుత్రోశ్వి సదృశద్యుతిః దుర్యోధనో నామ మహాన్ రాజా రాజర్షి సత్తమ అను మూలమువలన నీదుర్యోధనుని తండ్రి దుర్జయుఁడు కాన ధృతరాష్ట్రుని సుతుడగు దుర్యోధనుఁడు కాడని భావము.

45. అమర పురంధ్రీ శ్రీ రామణీయకము = దేవతా స్త్రీల చెలువము.

46. బుజ్జవములతో = ఉపలాలనములతో.

48. కెంగేలి జిగిసొంపు = కెంపువలె నెఱ్ఱనగు చేతికాంతి మాధుర్యము,
దిగిచికొను = స్వాధీనము చేసికొను, పొలపము= వ్యాప్తి, కెరల్పు=

నతిశయింపజేయ, వాతెఱతావి = పెదవి పరిమళము, తేకువమాలి= భయము విడచి, తూలపోయె = చిన్నపోయె (తేజోహీనుడయ్యె).

51. తలవీడుల = సమీపముల.

55. కుత్స=గర్హ, ఈడ=ఇవ్వడాయెను విభా ప్రభా సమానుండనుచోట ప్రభాసమానుండని పాఠాంతరము. ప్రభ=అగ్నిహోత్రుని భార్య.

62. అథౌఘు వాన్నామ నృపో న్నృగస్యా సీత్పితామహః తస్యాథౌఘవతీ కన్యాపుత్రశ్చౌఘ రథో భవత్। అను శ్లోకము వలన నోఘవంతుడు నృగుని తాతగారగు నొక రాజని స్పష్టముగ తెలియుచున్నది. కవి యతని కూమార్తెను సుదర్శనున కిచ్చినారు. ''అతని కోఘవంతు డనువాడు జనియించెనను పాఠమునుబట్టి ఈ యోఘవంతుడు సుదర్శనుని కొడుకన్నట్లు భాసించుచున్నది. అట్లయిన ఓఘవతి సుదర్శనునకు పౌత్రి యగును గదా సుదర్శనునకు పౌత్రినెట్లు వివాహమాడును అవివాహితునకు పుత్రపౌత్రాదు లెట్లు జన్మింతురు. ''కాన నతని కోఘవంతుడను వాడ''ను పద్యము పైన ఓఘవంతుని తండ్రి వర్ణనయుండి యుండును. లేక ''అతని'' అనుచోట పాఠాంతర మేమైన యుండవచ్చును.

66. అగ్గలంబు = విస్తారము, సొలయక = ఏమఱక

68. కింకిరిపడక = కోపపడక = కోతపడక, ఓలమానగొనక= మఱుగుపడక, అతిథి నినుగోరెనేని అనుచోట అతిథి నినుకోరెనేనియు నని పాఠాంతరము.

74 పజివోయిన = నశించిన.

80. భవత్సతియుం బతివ్రత యస్ఖలితచరిత = భర్తృవాక్య పరిపాలనమునకై కామాభిభూత చేతస్క కాక సంచరించుటచే పాతివ్రత్యమునకు భంగములేదని భావము.

అతిథి పూజ గడచినట్టి ధర్మువు గృహ
స్థులకు నొండులేమి తెలుపుచున్న
యది సమస్త కిల్బిషాపహామీయితి
హాసము...

అనుటచే అతిథి సత్కారాతిశయద్యోతనమే ఈకృతిహాస ప్రధాన తాత్పర్యము.

85 అబ్రాహ్మణుఁడు యజ్ఞాది సత్కర్మాచరణము వలనను దయా

సత్త్వాది సద్గుణములవలనను బ్రాహ్మణ్యము పొందగలడా యని భావము.

88. ఈ మతంగసంవాదము సంస్కృతమున గంగాప్రభావ వర్ణనానంతరము కనబడుచున్నది.

89. నొవ్వు = బాధ, గార్దభి = గాడిద (ఆడుది)

90. దూషణభాషణంబు = తిట్టు.

96. వలదని పాఠము.

98. అంగుష్ఠము=బొటనవ్రేలు, అస్థులతో సంగతముగ తోప = అసిపంజరము మిగులునట్లుగా, వెక్కసము = దుస్సహము.

100. బ్రాహ్మణ్యశార్దూలము = బ్రాహ్మణత్వమను పెద్దపులి.

104. ఉంకువ = ఓలి = శుల్కము (కట్నము), ఘోటకములు = గుఱ్ఱములు.

105. దేవతటిని = గంగ.

108. చరువు = హవ్యము.

110. ఋతుకాలము = స్త్రీలకు రజోదర్శనమయిన నాల్గవనాటినుండి పదారవనాటివఱకు ఋతుదినములందురు. ఇది గర్భధారణయోగ్యము, అశ్వత్థము = రావిచెట్టు, ఉదుంబరము = మేడిచెట్టు.

111 కఱువులు = గర్భస్థపిండములు, వీడ్వడిరా = వ్యత్యస్తములయ్యె.

114. అత్యంత...మానసయై = గొప్పదియగు దుఃఖమువలని పీడచేత మిక్కిలి బాధింపబడు చిత్తము కలదియై.

115. చేయు = చేయుము.

119 పదుండ్రు = పదుగురు.

120. అతఁడు వాఁటి = అతడు పాటి.

127. ప్రమందించుట = నాశముచేయుట.

130. తన శత్రువు భృగువచన వశమున బ్రాహ్మణుఁడైనట్లు గ్రహించి యట్టి జాతి భేదమునకు సంతసించెనని భావము.

131. పని వినియెద = సెలవు కొనియెద.

134. పౌరుషము పొలమువంటిది దైవము విత్తువంటిది. క్షేత్ర బీజములలో నెద్దిలోపించినను ఫలములేనట్లు పౌరుష దైవములలో నెద్దిలోపించినను కర్మఫలము పుట్టదని భావము.

143. మార్గాయాసమున ఖిన్నుఁడగు వానికి భోజనంబిడుట మిక్కిలి

పుణ్యము. అగ్ని నారాధించిన పురుషశ్రేష్ఠుడగును. దానమున తత్త్వదార్థాధిక్యత కల్గును. మౌనమున జ్ఞానియగును. తపమున భోగములు చేకూఱును, అహింసచే రూపము బలము జ్ఞానము నైశ్వర్యమును సిద్ధించును. బ్రహ్మచర్యమువలన పూర్ణాయువు ప్రాపించును. ఉపవాసములచే చిత్తము పరిశుద్ధమగును. ఫలజలాహారముచే రాజ్యము పత్రభక్షణముచే స్వర్గము లభించునని భావము.

147. వెంట్రుక తండము = కేశపాశము తృష్ణ = ఆశ.

150. లుబ్ధకుఁడు = బోయవాఁడు, విషదిగ్ధశరము = శరవ్యము వెంటనె నశించుటకై బాణములకు విషము పూతురు అవి విషశరము లనబడును.

151. కోటరము = చెట్టుతొఱ్ఱ, ఆవాసము = నివాసస్థానము

152. అనుజీవి = ఆశ్రయము

157. పేరెలమి = గొప్పయభివృద్ధి

162. విప్రముఖమున నిడుట = విప్రునకు భోజనము పెట్టుట.

166. సువర్ణుఁడు = గరుత్మంతుడు.

167. ఆంధ్రదేశమున ముద్రితములగు కొన్ని సంస్కృత భారతప్రతులలో నిట గరుడోపాఖ్యానము కానరాదు. ఆదిపర్వమందుండుటచే నిట పునరుక్త మని కొందరనుచున్నారు. ఆదిపర్వమున "కద్రూశాపంబున నయ్యెడి సర్పకుల ప్రళయంబు భవత్పితృ శిష్యుండైన ఆస్తీకుండను బ్రాహ్మణుండు కాడె యుడిగించెనని చెప్పి సహస్రపాదుండు రురునకు సర్పఘాతంబునం దుపశమన బుద్ధిపుట్టించెనన శౌనకాది మునులు సూతు నా వృత్తాంతంబు జెప్పుమన చెప్పినట్లున్నది. ఇట భీష్ముడు ధర్మజునకు చెప్పినట్లున్నది. కాన ననువాదకుడు ఒకడైనను ప్రసంగ భేదముండుటవలన పునరుక్త మనుట యుచితము కాదు.

168. అవియనడచె = భేదించె = పగులఁ గొట్టె

172. పరవుడవు = దాసివి, వారని నెవ్వగన్ = దుర్భర దుఃఖముచే

173. పులుగు = పక్షి

175. ఈఁగు = పోగొట్టును

177 ఘనతర కంధరుండు = మిక్కిలిపెద్ద మెడకలవాడు. చారుసుసంగతపక్షసార మండనుఁడు = మనోహరము లయి చక్కగా నతికిన బలిష్ఠములగు రెక్కలను నలంకారము కలవాఁడు, పరిస్ఫురద్ద్యుతివిడంబిత బాల దివాకరుండు = జాజ్వల్యమానమగు దీప్తిచే

ననుకరింపబడు బాలసూర్యుఁడు కలవాఁడు (కాంతియందు సూర్యునివంటి వాడని భావము.) లోక నయన పర్వనిర్వహణకారి = లోకముయొక్క నేత్రములకు నానందము కలిగించువాఁడు.

1 8. తొలుత వట్టి = జ్యేష్ఠ పుత్రుఁడు

181 నలిగా = ప్రేమతో లేక సన్నముగా, ఎలిగించి = కూయి, అస్నుసోలము = ఒడలెఱుఁగని మత్తు, తని=స్వల్పము, చిక్కపసువు = చిల్కగుంపు, కొలకుల కెలకుల = సరోవరప్రాంతముల, నడబెడంగు = నడక సొంపు, తరఁగ = తరంగము మీద మున్నీటి తేరు వవసము = సముద్ర సమీప వనము.

183. చంద్రునికాంతిఁ దెచ్చిమూసయందు పోసిరో లేక పాల సముద్రపుతరఁగలతో నచ్చుపోసిరో లేక ఈశ్వరుని శిరసునందలి గంగాప్రవాహము నురుసుతో చేసిరో యన్నట్లు తెల్లనగు నొకయుశ్వము ను కద్రువయు వినతయు గాంచిరని భావము. ఉత్ప్రేక్షాలంకారము కరువు = మట్టిముద్ద గండరువు = వడియచ్చు, సుధాబ్ధి తరంగ = పాల సముద్రపు తరంగము.

184. ఉచ్చైఃశ్రవము = ఇంద్రుని గుఱ్ఱము (ఇది తెల్లనిదని ప్రతీతి.)

186. తెమలంబలుక = అస్పృతమాడు, దరస్మితస్ఫురిత వక్త్రముతో =పిన్న నవ్వులయు మొగముతో.

187. పణంబుగా = పందెముగా

193. ఒడ్డారమునకు = పంతమునకు = ప్రతిఘటించుటకు

196. నెనరు = ప్రేమ

198 తద్దహన ... తాపమున=అయగ్నియొక్క భయంకర భూరి జ్వాలలయందు పడుటచేత పుట్టిన దుర్భర సంతాపమున.

199. వాలధి = తోక

200. సంతోషద్భ్రాంతి, తద్ద్రోహంబు అనెడి పదములతో ప్రాసమైత్రికై కద్రువ, భద్రాత్మక, యనెడి పదములలోని దకారమునకు "అనచిచ" అను సూత్రముచే ద్విత్వము.

203 మైలావు = దేహదార్ఢ్యము

205. సవతాలికి (సవతి + అలికి) సవతివనితకు.

207. విషాదభరార్తమూర్తియై = దుఃఖభారవివశాకారుఁడై

209. దారితారి = ఖండితశత్రుఁడు.

211. ముఱికటించుకొని = త్రిప్పికొని.
212. కూర్తని = ప్రేమగలవాడవని.
216. కృపాణ...హస్తులై=ఖడ్గము, శక్తి, మొదలగు గొప్ప ఆయుధములు కల హస్తములు కలవారై, ఇన్నవలనో = ఇనుపవలలో.
218. ఇభంబు = ఏనుగు, కమఠంబు = తాబేలు, ఎర = ఆహారము.
219. కచ్ఛపము = తాబేలు.
220. ప్రాక్పయోనిధి= తూర్పుసముద్రము, ఘనశృంగకబళితాకాశము= ఉన్నతశిఖరములచే నాక్రమింపబడి యంబరముకలది.
221. గారు = ఏనుగు.
222. ప్రళయకాలమున శ్రీమన్నారాయణుఁడు శేషునిపై నిదురించు చుండ నాతని కర్ణమలమునుండి రజస్తమోగుణములు మధుకైటభు లను రాక్షసులై జన్మించి వేదములను హరించి బ్రహ్మను జంప యత్నించెను. బ్రహ్మ భీతుఁడై యోగనిద్రను ధ్యానింపగా నామె శ్రీమన్నారాయణుని మేలుకొల్పెను. శ్రీమన్నారాయణుఁడు హయగ్రీవావతారములో మధుకైటభులతో నైదువేలేండ్లు యుద్ధమొ నర్చెను. మధుకైటభులు మహామాయా విమోహితులై "ఓ నారా యణా నీయుద్ధమునకు మెచ్చితిమి వరము కోరుకొనుమనిరి." నారాయణుఁడు మీరు నాచే వధ్యులగుఁడని కోరెను. వారు తమ కళేబరములను సలిలపరిప్లుతము కానిచోట విడిచినచో నట్లే యగు గాకని చెప్పిరి. ప్రళయమున సర్వము జలమయమగుటవలన శ్రీ మన్నారాయణుఁడు వారలను చక్రముతో తన జఘనమునందు ఖం డించెను. వారే గజకచ్ఛపములని భావము.
223. ముక్కంటికి = ఈశ్వరునకును,త్రిదశాహారము = అమృతము,జంతు కోటికి బాల్యకౌమార యౌవనవార్ధక్యములని
228. నాలుగు దశలు దేవతలకు వార్ధక్యములేదు. కాన వారికి మొదటి మూడుదశలగుటచే త్రిదశులు. వారలకు అమృతము ఆహారము)
229. వియద్వీథీగతుండై = ఆకాశగతుఁడై, పక్షతి వితాన స్ఫారదీప్తి వ్రజంబు = రెక్కల సమూహముయొక్క విస్తారకాంతిపుంజము.
230. దానోగ్ర గజేంద్రుడు = మదించిన ఏనుగు గండభాగముల నుండి ద్రవించుమదము దానమందురు. ఆ దానముచేనుగ్రమగు ఏనుగు.
232. సాము = సగము, వలకాల = కుడికాలిచే

235. మేఘ... కేలియో= రెండు మేఘములతోఁ గూడిన పర్వతము నాక సమునందు క్రీడించుచున్నదో యన (పూర్వము పర్వతములు రెక్కలుకలవై ఎగిరిపోయెడివని ప్రతీతి)

244 నిందితాచారయుతము = వేదశాస్త్ర నిషిద్ధమగు ఆచారముకలది.

245 వృక్షశాఖములతో పాటు మనము నందలి చింతనుకూడ విడిచెను. వృక్ష శాఖను విడుట చే చింతాహీనుడయ్యెనని భావము

249. తనికిన = పండిన, ఎఱకలు = రెక్కలు, ప్రమక్కబడు=తేజోహీనతనొందు

255. అయోమయము = ఇనుముతోఁ జేసినది.

261. ఎడగలుగంగపోయి = దూరమునకు బోయి

265 సూరెల = పార్శ్వమందు

266. నల్ల = మచ్చ

274 సృగాలను = నక్క, వఱడు =నక్క, పీనుగునంజుడు = శవభక్షణము.

282. ఓరలువారగ = క్రీగంటి ప్రసాదములతో

285. వల్లభప్రతికూల = భర్తకు ప్రతికూలురాలు, అబ్జినీ...వాటమాల= కమలములుగల కొలనులు, వృక్షసమూహములు పూలతోటలు అను వానియందు.

287. వజ్రి = ఇంద్రుడు, తేరకాడు = ఒంటరి.

297. ఇతకరి మాటలు = హితవచనములు, వేసలి=కోప్పు, వెక్కడు = వెక్కవచ్చు నల్లెడ్చుచు.

307. సురతాంతే సుఖంపుంసాం స్త్రీణాంతు సతతం సుఖం, ధాతుక్షయ నిమిత్తేచ విరామేచోపజాయతే॥ అనివాత్స్యాయనము ౨.౧. ౪౧.

318. ప్రజ్వల దనలస్ఫూర్తి =ప్రజ్వలించు నిప్పు వంటివాఁడు.

320. యమళము = జంట

| | | |
|---|---|---|
| 327. | ఆకాశ వాయ్వగ్ని సలిల భూమిలు (భూతములు) | 5 |
| | శబ్దస్పర్శరూప రసగంధములు (గుణములు) | 5 |
| | శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములు (బుద్ధీంద్రియములు) | 5 |
| | పాద పాయూపస్థ పాణివాక్కులు (కర్మేంద్రియంబులు) | 5 |
| | అహంకారము | 1 |
| | మనసు. | 1 |

| | |
|---|---|
| బుద్ధి | 1 |
| అవ్యక్తము. | 1 |
| తత్వములు మొత్తము | 24 |

330. అప్పతి = వరుణుడు.

336. ఈ ఇరువది నాలుగు తత్వముల కన్న నతిరిక్తమగు చైతన్యము విష్ణుడని భావము.

342. నదల (చదల = ఆకాశమందు) (గనపదవాదేశము).

355. అనింధకము = కట్టెలు లేనిది.

357. నన్ను నరయు మెచటికో (యని పాఠము)

372. దారుణరూప సుపర్ణసంఘముల్ = భయంకరమగు నాకారముగల గరుడ సంఘముల్.

ఇతి

ప్రథమాశ్వాసము టిప్పణి

# శ్రీమదాంధ్ర మహాభారతము.

## అనుశాసనికపర్వము.

### ద్వితీయాశ్వాసము.

(టిప్పణి)

౬. జనదృశ...విద్యా = సాటిలేని రూపము గుణము ప్రవర్తనము కులము విద్యయు గలవాఁడా.

7. బాహుదా = ఒకనది, ప్రోలికి = పట్టణమునకు.

8. అభ్యర్థనీయంబు = కోరఁదగినది.

9. హర్మ్యము = ప్రాసాదము.

10. పర్యంకము = మంచము, ప్రౌఢవయస్క = ముసలిది, (తత్రాపశ్యజ్జరాయుక్త)మని మూలము.

13. సీతు = చలి.

14. అసిధారావ్రతమొనర్చెననియు నట్టివాఁడు కన్యాదాన పాత్రుఁడనియు భావము.

15. మగవారు భోగపరులు. వారి యభిలాషములను దాపరు. స్త్రీలు తమ యభిలాషములను తాల్మితో కప్పిపుతురు. ఇట్టియెడ నాకునైన నిన్నుగోర పరిగ్రహింపకుండు టుచితమాయని భావము.

17. అలుకరు = భయపడరు, అగ్రజననుజుకొనరు = అన్నను తమ్ముని నరకుచేయరు.

21. ముసరుతనంబు = వార్ధక్యము, పరిణతవయస్క = ప్రాలినవయసు కలది.

25. గార్హస్థ్యమునఁ బ్రవేశింపబోవు నష్టావక్రుని చిత్తశుద్ధిని పరీక్షించుట యేకాక ఆతనికి "స్థవిరాణా మపిస్త్రీణాం బాధతేమైథున జ్వరః (స్త్రీలకు ముదుసలి తనమందును సంసారేచ్ఛ నశింపదు) అని యుపదేశించుట యువదాన్యుని కభిప్రేతము. అందువలననే ఉత్తరదిక్కు ప్రథమమున వృద్ధవలె కనుపించి మోహించినది. పిదప వధూటియై యాతని చిత్తవృత్తి పరీక్షించినది.

27. ప్రతిలోమ సరణి = హీనకులుడు ఉత్తమకన్యను వివాహ మాడుట (వ్యాఖ్యానము) అనులోమ సంభవుడు = ఉత్తమ కులుని వలన హీన కులస్త్రీయందు పుట్టినవాడు.

40. పయోరాశిఁ బడ్డగడ్డయు వ్రాలెక్ = సముద్రమున పడ్డ మంటి గడ్డవలె

56. దేవలకు = పూజారిని
కష్టక్లీబుని దేవల కుని చికిత్స
కుని నవస్మారిఖలుకృతఘ్నుని రాజ
యక్ష్మయుతుని నర్తకున కాయకునిసోమ
విక్రయుని వేదవిక్రయు విడువవలయు॥
అని పాఠాంతరము.

59. తెరువాటు వలన = దారిలో దొంగలచే కొట్టబడుట వలన

62. మార్గము - చెఱచుట = ముళ్లకంచె కొయ్యలు పాతి మార్గమును చెఱచుట.

64. ప్రప = పానశాల

72. తన భార్యలగు తార లందరను పరిత్యజించి చంద్రుడు రోహిణియందు లోలుడైయుండఁ దారలు కోపించి తమ తండ్రియగు దక్షప్రజాపతితో మొఱపెట్టుకొనె ననియు దక్షుఁడు పలుమారు చంద్రునితో నందరు భార్యలయందు సముఁడవై వర్తింపుమని యాదేశించినను చంద్రు డట్లొర్ప డాయెననియు. నందున కుపితుఁడై దక్షుఁడు చంద్రుని చంద్రభాగ తీరమున ఖండించె ననియు నందుననే ఆనదికి చంద్రభాగయను నామము కలిగె ననియు ఆ నదియందు స్నానమాడిన క్షయవ్యాధి రాదనియు కాళికా పురాణము.

76. మహాశ్రయ మనుచోట బింబాశ్రయని పాఠాంతరము. ఇదియొక తీర్థ విశేషము.

77. విపాశ = పాంచాల దేశమందలి యొకనది.

80. శ్యామా యాస్త్వాశ్రమం గత్వా ఉషిత్వాచాభిషిచ్యతే
ఏకపక్షం నిరాహారః స్త్వంతర్ధ్యానఫలం లభేత్॥
అనుటచే అంతర్ధ్యానఫలమను పాఠ ముచితము.

88. పిండారక ఉపస్పృశ్య ఏకరాత్రి షితోనరః
అగ్నిష్టోమ మవాప్నోతి ప్రభాతాం శర్వరీం శుచిః॥

అనుటచే ఏకరాత్రమను పౌర ముచితము.

90. కామం క్రోధంచ లోభంచ యోజిత్వాతీర్థ మావసేత్॥
నతేన కించిన్నప్రాప్తం తీర్థాభి గమనాద్భవేత్ ।
యాన్యగమ్యాని తీర్థాని దుర్గాణి విషమానిచ
మనసాతాని గమ్యాని సర్వతీర్థ సమీక్షయా॥
అనుటచే దీనిపిదప రెండుపద్యములు ప్రక్షిప్తములే.
ఆయా తీర్థనివాసులైనను ఈనియమములు లేనిది ఫలము కల్గదని భావము.

101. ఉంఛవృత్తి = పరిగ ఏరిజీవించుట

102. త్రిపథాసేవనమున = గంగను సేవించుటచేత, సంపరిత్యాగము = సన్యాసము

113. ఉత్క్రమణకాలమున = మరణకాలమున

115. పితరులను పొరమూకంటె తారలను పొరముపరము

117. తెలచి = ప్రార్థించి

138 తరణికి = సూర్యునికి, పర్జన్యుకి = మేఘుని

141. కూర్తురు = అనుకూలింతురు

144. సోమాత్మకులు = చంద్రస్వరూపులు (బ్రాహ్మణులకు చంద్రుడు రాజని శ్రుతి)

149. విప్రునల్కి అమరవిభుని భగ సహ సచిహ్నితునిగను ప్రసాదము సహస్ర నేత్రభాసురిగ నొనర్చెనని భావము

150. రథాంగపాణి = రథాంగమన చక్రము. అది చేతిలో నాయుధముగా గలవాడు (వాసుదేవుడు)

155. వచ్చునను ప్రధానక్రియలో ససమాపకక్రియల కన్వయము కాగా నగ్నినంటవచ్చు హిమవదచలంబు కదలువవచ్చు, గంగ కట్టవచ్చు నని భావము

174. చలస్వభావా దుస్సేవ్యా దుర్గ్రాహ్యా భావతస్తథా ప్రాజ్ఞస్యపురుష స్యేహ యథావాచ స్తథాస్త్రియః నాసాంకళ్చి దగమ్యోస్తి నాసాం వయసి నిశ్చయః విరూపం రూపవంతం వా పుమానిత్యేవ భుంజతే యదిపుంసాం గతిర్బ్రహ్మన్ కథంచి న్నోపపద్యతే అప్యన్యోన్యం ప్రవర్తంతే నహితిష్ఠంతి భర్తృషు అంతకః పవనోమృత్యుః పాతాళం బడబాముఖం క్షురధారా విషం సర్పోవహ్ని రిత్యేక

తస్త్రియః అనియు మూలము.

178. మతకము = మాయ

180. సంసార తవపర్యంత పదవీసః వీయసీ అంతరా సస్తరా స్యాత్తా
నస్సురంభోజలోచనాః అని భర్తృహరి.

182. లోచనీయము = దర్శనీయము

183. ఉపదర్శనము = యజ్ఞమునందు లోపము కలుగకుండునట్లు పరీ
క్షించుట.

189. ఈపద్యము భావము పైపద్యముచే గతార్థమగుటచే నిది ప్రక్షిప్తము

197. తమకము = మోహము.

214. మోస = మోసము (మువర్ణలోపము)

220. వివాహములు ఎనిమిదివిధములని శాస్త్రముండు:

1. విద్యాశీలాదులు గలవానికి నలంకృతయగు కన్యను నాచ్ఛాదించి దానము చేయుట. (బ్రాహ్మము)
2. ఈవరునితో ధర్మము చరింపుమని కన్యనిచ్చుట. (ప్రాజాపత్యము). ఇందు ఆశ్రమాంతర ప్రవేశమున కవకాశము లేదు)
3. కన్యాప్రదాతకు గోమిథునము కాని వరము గాని ఇచ్చి కన్యను స్వీకరించుట. (ఆర్షము)
4. కన్య నలంకరించి ఋత్విజునకు యాగకాలమున దానము చేయుట (దైవము) (పైనాల్గింటిలో కన్య నాచ్ఛాదించి దానము చేతురు.)
5. ప్రేమించిన స్త్రీని ప్రేమించునయువకుండు వివాహమాడుట. (గాంధర్వము)
6. కన్యాశుల్కపూర్వముగ స్వీకరించుట (ఆసురము)
7 కన్య బంధువులను జయించి కన్య నెత్తికొనిపోవుట. (రాక్షసము.)
8. ఒడలెఱుంగని కన్య నపహరించికొనిపోవుట. (పైశాచము)

వీనిలో ప్రాజాపత్యార్షదైవపైశాచములు భారతములో చెప్పబడ లేదు. గౌతముని గాంధర్వ మిచట క్షాత్రమగును. కాని ప్రాజాప త్యార్షదైవములు ఇచటి బ్రాహ్మములో నంతర్భూతములు. క్షాత్రము గాంధర్వాంతర్భూతము. పైశాచము వివాహమే కాదనియు దొంగ తనమనియు భారతాశయము (పైశాచశ్చా సురశ్చైవ నైకర్తవ్యౌ కథంచన) అని మూలము. కాన రాక్షసపైశాచము ఉభయులు

నిషేధించిరి. ఆసురము భారతనిషిద్ధము. (సంస్కృతమున ఆసురము భారతనిషిద్ధముగ కన్పడుటలేదు.) మతాంతరస్వీకృతము. గాంధర్వమును కొందరు నిషేధించిరి. కాగా బ్రహ్మము తద్వికారము లుత్తమములనియు గాంధర్వాసురములు మధ్యములనియు రాక్షస పైశాచము లధమములనియు భావము.

226. పైశాచశ్చా సురశ్చైవ నకర్తవ్యౌకథంచన అను మూలమున కీ పద్యము విరుద్ధము.

227. త్రింశద్వర్షో దశవర్షాం భార్యాం విందేతనగ్నికాం
ఏకవింశతివర్షోవా సప్తవర్షానవాప్నుయాత్॥
(ముప్పదియేండ్లవాడు పదియేండ్లదానిని ఇరువదియొక్కేండ్లవాడు ఏడేండ్లదానిని వివాహమాడవలెను.) అనియు మూలము.

254. విలికికొనిన = విలువనిచ్చి కొనిన

258. మూరుకొనగ = ఆఘ్రాణింపగా.

278. కూరెదవు = పొందెదవు

287. వాసవాభ వైభవము = ఇంద్రవైభవము.

2 1. ఉత్తమ క్షత్రియత్వ మహోష్మలము = ఉత్తమమైన క్షత్రధర్మము చే మిక్కిలి ప్రతాపము కలది.

295. గొనకొని = ప్రయత్నించి

306. తెప్పిటి = తెప్పరిల్లి

308 జెడనాడి = దూషించి

310. చామ = యువతి

314. ప్రతోదవ్రణములు = కొరడా దెబ్బల వలన గాయములు.

318. పద్మాకరములు = సరస్సులు

331. యెత్తికోలు = ప్రయత్నము

333 కాంస్యోపదోహా = కంచుతో చేసిన పాలకుండ కలది

337. వీరశయనంబు = యుద్ధమున వెన్నుచూపక మరణించుట

353. ఉర్వక = భూమి

363. ఒసగి నతని (ఒసగిన + అతని)

365. పరతరములు పూర్వము పదితరములు పరమని భావము.

376. మణిమయావాస శయ్యాసనములు = మణులతో చేసిన గృహము శయ్య ఆసనములు.

378. కార్తె = కృత్తికా నక్షత్రము, అబ్జగర్భుని తార = రోహిణి (రోహిణి బ్రహ్మ యధిపతియని జ్యోతిషము, శశితార = మృగశీర్ష అశ్వనికి నశ్వనీదేవతలు భరణికి యముఁడు కృత్తిక కగ్ని, రోహిణికి బ్రహ్మ మృగశిరకు చంద్రుడు ఆర్ద్రకు రుద్రుడు పునర్వసున కదితి పుష్యమికి బృహస్పతి ఆశ్లేషకు నాగములు మఘకు పితృదేవతలు పుబ్బకు భగుఁడు ఉత్తరకు నర్యముఁడు హస్తకురవి చిత్తకింద్రుఁడు స్వాతికి వాయువు విశాఖకు నింద్రాగ్నులు అనూరాధకు మిత్రుఁడు జ్యేష్ఠకింద్రుఁడు మూలకు రాక్షసుఁడు పూర్వాషాఢకుదకములు ఉత్తరాషాఢకు విశ్వదేవతలు అభిజిత్తునకు బ్రహ్మ శ్రవణమునకు విష్ణువు ధనిష్ఠకు వసువులు శతభిషమునకు వరుణుఁడు పూర్వాభాద్ర కజచరణుఁడు ఉత్తరాభాద్ర కహిర్బుధ్న్యుఁడు రేవతికి పూషయు నధిదేవతలని జ్యోతిషము.

దితితార = పునర్వసు

గురుతార = పుష్యమి

భగుండధిదేవతయగు తార = పుబ్బ

షాష్టికాన్నము = ఆరునెలలకు పండు వరియన్నము

నకరిరథము = ఏనుగుతో కూడిన రథము

కటివేము = కటివేపాకు

379. గొటియమెటచి = గొఱ్ఱెమాంసము పూర్వాభాద్ర పదారోగే రాజమిషాక్ష ప్రదాయతు అను మూలముచే గొఱలు రాజమాంసములను పొతముచితము.

386. అకలేక = అడ్డులేక

388. గఁగ = కుండ

397. కర్సనము = కృషి (కర్షణశబ్దభవము)

401. నాకి = నరకవాసి

402. క్రేపెడలినదాని = దూడ చచ్చినదాని

414. గోశకృత్ప్రలేపనము = ఆవుపేడతో నలుకుట

427. సబాము = స్వభావము

429. ధరణీసువర్యునకు = భూసురునకు

430. కాలవశగతి యావహిల్లి = కాల ధర్మము నొంది = మరణించి

435. శృకలాసత్వము = తొండ యాకారము

440 విప్రస్వాపహరణము = బ్రాహ్మణుని సొమ్మునపహరించుట

446. ఇధ్మసమూలు = సమిత్తులు ఏటిమడ = ఏటి ప్రవాహ మార్గమున వఱ్ఱోడి = ప్రవహించి = కొట్టుకొని.

447. మునునలి గోవుల దాన మొనరించుచుండ నీ నాచికేతుఁడు తన్నె వరి కిత్తువని తండ్రినడుగ మృత్యువున కిత్తు నన్నట్లు కఠోపనిషత్తున గలదు

450. త్రిరాత్రము గడచినట్లు కఠవల్లిలో నున్నది.

454. సమవర్తి కొలువు కూటము = అంతకాలయము = యమమందిరము.

460. గనపయెద్దు = పెద్దయెద్దు

461. సూస్వ్య యుజ్వలగోవ్రులు = సూర్యుని ప్రకాశించు కిరణములు

469. దాయధనము = పిత్రార్జితమునుండి వంచుకున్నది.

ఓం తత్సత్